OCT-1987

A Super treat in every sweet!

# SUPER SIZE!
# SUPER TASTE!

nutrine

## SuperStar

Premium toffees

TWIN TREAT

DELITE

TOP CREAM

Heavenly delights

nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్, చిత్తూరు ఆంధ్రప్రదేశ్

CLARION/NC/8636

# వనిత

నవంబర్ '87 సంచిక

## దీపావళి విశేష సంచికగా వెలువడుతోంది!

విశిష్ట ఆకర్షణ:
సుప్రసిద్ధ రచయిత్రి
**వాసిరెడ్డి సీతాదేవి**
వినూత్న నశేష నవల
ఈ సంచిక నుంచే
ఆరంభం!

ఆకర్షణలు + ప్రత్యేక
ఆకర్షణలు!

సుప్రసిద్ధ
రచయిత్రుల
కథానికలు

అబాలగోపాలాన్ని
ఆకట్టుకుంటున్న
**డా॥భానుమతీ రామకృష్ణ**
'వినోదవాణి'

బహుమతి పొందిన పది వసంద్రైన చిట్టి కథలు •••••• వర్ణ చిత్రాలతో ప్రత్యేక వంటకాలు

ఇంకా....

వెండితో అందమైన ఆభరణాలు, దక్షిణ భారతదేశంలో పట్టు చీరల పరిశ్రమ, విహార యాత్రా స్థలం మానస సరోవరం గురించి ప్రత్యేక వ్యాసాలు, హస్తకళలు, శరీర సౌష్ఠవం, వైద్య రంగం, చట్టం మొదలైన అంశాలపై ఆసక్తిదాయకమైన వ్యాసాలు, ఇవి కాకుండా ప్రతి సంచికలోనూ అందరి ఆదరాభిమానాలూ చూరగొంటున్న 'ఇదీ మన సమాజం', 'నిరసనవేదిక', 'కొత్తకాపురం', 'నా జ్ఞాపకాలలో వనితలు', 'దాచేస్తే దాగని సత్యాలు' వంటి శీర్షికలతో, ఆకర్షణీయమైన వర్ణచిత్రాలు, మరెన్నో విశేషాలు, ఎక్కువ పేజీలతో 'వనిత' నవంబర్ '87 సంచిక దీపావళి విశేష సంచిక రూపొందుతోంది!

---

వెల ఐదు రూపాయలు మాత్రమే!



## నేడే మీ కాపీ రిజర్వ్ చేసుకోండి!



---

వివరాలకు:
*విజయా బుక్ హౌస్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు-600 026*

## రైటర్స్ మిల్క్ చాక్లెట్.
## నోట్లో వేసుకోగానే కరిగిపోతుంది!




రైటర్స్ మిల్క్ చాక్లెట్.
స్విట్జర్లాండు దేశపు
జేకబ్స్ సుషార్డ్ వారి
సహకారంతో
తయారుచేయబడినది.
వీరు
ప్రపంచంలోకెల్లా
అత్యుత్తమ చాక్లెట్
తయారీదార్లు.
పరిపుష్టమైన. నున్నని.
క్రీమునిండిన రుచికరమైన చాక్లెట్.
ఇలాంటి చాక్లెట్ కోసం
సముద్రాలే దాటి వెళ్లేవారు.
మీకిప్పుడది నేరుగా ఇక్కడే లభిస్తోంది.
ఇప్పుడు మీరు పాత మిల్క్
చాక్లెట్ దేనితోనూ సరిపెట్టుకోబోరు.
ఎందుకేమిటి?
మీరే తెలుసుకున్నారు కదా.
మంచిది.

**స్విట్జర్లాండు దేశపు జేకబ్స్ సుషార్డ్ వారి సహకారంతో తయారుచేయబడినది.**

అమ్మకందార్లు 

Sista's-DWFP-295/87 TEL R A

# మీరు దీనితో చేయగలిగే అద్భుతాలు ఎన్నెన్నో!




మేలైన అడ్ హెసివ్

## క్రొత్త
# కేమ్లికాల్-86
## ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ అడ్హెసివ్

కొన్ని రంగు-రంగు వస్తువుల, కళాత్మక వస్తువుల ముక్కలు....
ఒక ట్యూబ్ కేమ్లికాల్-86....వీటికి తోడు మీ ఊహాశక్తి.
ఇవన్నీ చేరితే తయారవుతాయి ఎన్నెన్నో అద్భుతాలు!

విరిగిన బొమ్మలు అతకాలన్నా, ఆట వస్తువులు
జోడించాలన్నా... ఒక్కటేమిటి త్రీ-డి గ్రీటింగ్
కార్డులు....తోరణాలు....గోడలను అలంకరిస్తూ వేలాడే
అందమైన వస్తువులు....చైనా లాంతర్లు....క్రిస్ట్‌మస్
ట్రీలు....గాలి పటాలు, నమూనాలు....కృతిమ ముఖాలు,
అందమైన జపాను విసన కర్రలు, అందమైన ర్యాపింగ్
పేపర్‌లో కానుకల ప్యాకింగ్‌లు, ఫోటో ఫ్రేములు....
పర్నీచరు, పిక్చర్లు, ఇంటి వస్తువులు సరిచేసుకోడానికి....



కేమ్లిన్ ప్రై. లి. స్టేషనరీ డివిషన్, బొంబాయి-400 059.

C-TEL 2




ఆహా! ఆహా! ఆహా!
భారతదేశంలోని రుచికర, మీగడగల,
కమ్మని చాక్లెట్ ఇదిగో! వచ్చేసింది.

క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.
ఉత్తమ రుచికోసరం అత్యున్నతమైన
ఎగుమతి ప్రమాణాల కోకోతో
తయారైంది. అందుకే అది మిమ్మల్ని
తనివితీరా అనందింపచేస్తుంది.




భారతదేశపు అతిపెద్ద,
అత్యాధునిక కర్మాగారం నుండి.

క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు

R K SWAMY/CL/5194/TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["రాజ్యరక్షణ"]కు ఆధారం, గంగిశెట్టి శివకుమార్ రచన. సాధారణంగా, ఒక మనిషిలో వున్న మంచి గుణాలను గురించి చెప్పేటప్పుడు, ముఖ్యంగా అతడి దానగుణాన్ని ప్రస్తుతించడం జరుగుతూంటుంది. అన్ని సుగుణాలకూ తలమానికం లాంటిది, దానగుణం. అయితే, పాత్రనెరగని దానం చిక్కులకు దారితీస్తుంది. ఇందుకు ఉదాహరణ, ''అపాత్రదానం'' అన్న కథ.

## అమరవాణి

కిమ్ కరోత్యేవ, పాండిత్యమస్థానే వినియోజితం,
అంధకార ప్రతిచ్ఛన్నే, ఘటేదీవ ఇవాహితః.

[అనువుగానిచోట పాండిత్యాన్ని ప్రదర్శించడంవల్ల ప్రయోజనం ఉండదు. అది, మూతవేసిన కుండలోపల దీపం వెలిగించి చీకటిని పారదోలడానికి ప్రయత్నించడం వంటిదే అవుతుంది.]

సంపుటి 81 అక్టోబర్ '87 సంచిక 4

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00



## చందమామ కబుర్లు



### సముద్రంలో నగరం!

భూమి మీద నివసించడానికి స్థలం చాలకపోయినా, అది జపాను జీవనవిధానం మీద దెబ్బ తీయజాలదు. ఎందుకంటే టోక్యోనగరానికి 150 కి. మీ. దూరంలో సముద్రంలో ఒక నగరాన్ని సృష్టించడానికి జపాను పూనుకున్నది. ఒక వైపుకు 5 కి. మీ. పొడవుగల ఈ మహానగరం పెద్ద స్తంభాల మీద నిర్మితం కానున్నది. వంద మిలియన్ టన్నుల ఉక్కు ఉపయోగించబడనున్న ఈ సముద్రనగర నిర్మాణానికి 2 లక్షల మిలియన్ డాలర్ల ధనవ్యయం కాగలదని అంచనా!

### ఎత్తయిన ఏనుగు!

సాధారణంగా ఏనుగుల ఎత్తు—తొమ్మిది, పది అడుగులు వుంటుంది. అయితే, నేపాల్‌లోని శుక్లాఫాంటా వైల్డ్‌లైఫ్ రిజర్వ్‌లో 11 అడుగులా 5 అంగుళాల ఎత్తయిన ఏనుగు ఒకటి ఉన్నది. 45 సంవత్సరాల వయసయిన ఈ ఏనుగే ప్రపంచంలో కెల్లా ఎత్తయిన ఏనుగుగా భావించబడుతున్నది నేపాల్—భారత సరిహద్దులో వున్న ఈ రిజర్వ్‌లో దాదాపు 3000 జింకలు (యాంటిలోప్స్) ఉన్నాయి. ఈ జింకల కొమ్ములకు 6 వలవలు వున్నాయి!





### లెనిన్ ధరించిన గడియారం

1918 సంవత్సరం వరకు లెనిన్ ధరించిన జేబు గడియారం వెండిది. మ్యూనిచ్‌లో 103,000 డాలర్లకు వేలం వేయబడింది. 1917 బోల్షివిక్ విప్లవానికి పూర్వం—రష్యా జార్లకు చెందిన ఈ గడియారాన్ని, లెనిన్ కొంతకాలం ధరించి. 1918 సంవత్సరం—జర్మన్ రాజకీయవేత్త అయిన కార్ల్ లెబ్‌నెక్‌కు కానుకగా ఇచ్చారు!

### యోగచికిత్స

గుండెజబ్బులు రాకుండా జాగ్రత్తపడడానికీ, వచ్చిన జబ్బును కుదర్చడానికీ యోగాభ్యాసం ఎంతవరకు ఉపయోగపడకలదు? అన్న విషయం గురించి పరిశోధన జరపడానికి భారత్—సోవియట్ విజ్ఞాన వేత్తలు సంయుక్తంగా ఒక పథకం రూపొందించారు. ఒక మాస్కో సంస్థ—న్యూఢిల్లీలోని ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ సహకారంతో మూడేళ్ళపాటు ఈ పరిశోధనలు జరుపనున్నది.



పురాణగాథలు :

# అశోకసుందరి

శివపార్వతులు ఒకనాడు నందనవనంలో విహరిస్తూండగా, శివుడు పార్వతికి కోరిన కోరికలు తీర్చే కల్పవృక్షాన్ని చూపాడు. కల్పవృక్షం శక్తిని పరీక్షించకోరి, పార్వతి, "నాకొక పాపను ప్రసాదించు," అన్నది. మరుక్షణమే పార్వతి చేతులలో అందాలపాప ప్రత్యక్షమయింది. ఆ పాపకు అశోకసుందరి అని పేరు పెట్టారు.

అశోకసుందరి అందం చూసి, హూండాసురు డనే రాక్షసుడు, ఆమెను తీసుకుపోయి, పెంచి మునుముందు పెళ్ళి చేసుకోవాలని ఆశించాడు. అయితే, అశోకసుందరిని, ఊర్వశీ పురూరవుల మనుమ డయిన నహుషుడి కిచ్చి పెళ్ళి చేయాలని పార్వతి సంకల్పించినట్టు రాక్షసుడికి తెలియవచ్చింది. వెంటనే వాడు నహుషుణ్ణి పెంచే చెలికత్తెను ఆవహించాడు. తాను ఏమి చేస్తున్నది కూడా మరచిపోయి ఒకనాటి రాత్రి, ఆ చెలికత్తె, శిశువుగా వున్న నహుషుణ్ణి, ఒక అడవికి చేర్చింది. రాక్షసుడు అక్కడ్డించి, ఆ పసికందును తీసుకుపోయి తన భార్య కిచ్చి, చంపి వంట చేయమన్నాడు. వాడి భార్య ఆ పనిని తన వంటమనిషికి అప్పగించింది. బిడ్డను చంపడానికి చేతులాడక, వంటమనిషి ఆ శిశువును వసిష్ఠ ఆశ్రమం వద్ద వదిలిపెట్టి, జంతుమాంసాన్ని వండి, అదే శిశువు మాంసం అని చెప్పి, రాక్షసుడి ముందుంచింది।

వసిష్ఠ ఆశ్రమంలో పెరిగి పెద్దవాడయిన నహుషుడు, ఒకనాడు — ఒక కవి తన జీవితగాథను కావ్యంగా గానం చేయడం ఆలకించాడు. వసిష్ఠుడి ద్వారా, తను అశోకసుందరిని వివాహమాడడం దైవ నిర్ణయం అన్న విషయం తెలుసుకున్నాడు. ఆ తరవాత, విల్లంబులు చేతబట్టి, అశోకసుందరి వున్న చోటికి బయలుదేరాడు. సరిగ్గా ఆ సమయానికే, హూండాసురుడు అశోకసుందరిని పెళ్ళాడమని బలవంతం చేస్తున్నాడు. నహుషుడు ఆ దుర్మార్గుణ్ణి సంహరించి, అశోకసుందరిని పెళ్ళాడి హాయిగా జీవించాడు।






సింహపురంలో వుండే శివయ్య, కేశవయ్య అనే యిద్దరు స్నేహితులు, తమ చదువు పూర్తికాగానే, అక్కడి సంతవీధిలో విడి విడిగా వర్తకం ప్రారంభించారు.

కొన్నాళ్ళు గడిచాక, ఒక రోజున వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడు, శివయ్య కేశవయ్యతో, "మనం పెట్టుబడి పెట్టిన సొమ్ము, ఏడాది తిరక్కుండా రెట్టింపు చేయగలిగినప్పుడే, మనం నిజమైన వ్యాపారులం. ఈనాడు ఊళ్ళో పెద్ద వ్యాపారులుగా చెలామణీ అవుతున్నవాళ్ళందరూ— సరుకులు కల్తీచేసో, తూకాల్లో మోసం చేసో, లేక రాజుగారికి న్యాయంగా చెల్లించాల్సిన పన్ను ఎగగొట్టో, ధనార్జన చేసిన వాళ్ళే గదా! త్వరగా మన దగ్గిర డబ్బు పోగుపడాలంటే, వాళ్లను అనుసరించడం కన్నా, మరొక మంచి మార్గం లేదు," అన్నాడు.

ఆ మాటలకు కేశవయ్య నవ్వి, "న్యాయబద్ధంగా వ్యాపారం చేసినా కూడా, కొన్నాళ్ళ తరవాత పోగుపడవలసిన సొమ్ము, మన దగ్గిర పోగుపడక మానదు," అన్నాడు.

ఆ జవాబుకు శివయ్య విసుక్కుంటూ, "ఈ న్యాయం, అన్యాయం అన్న నియమాలు, మనకై మనం కల్పించుకున్నవి. అన్యాయంగా ప్రవర్తిస్తే, చనిపోయాక నరకానికి పోవలసి వస్తుందనే కదా, నీ భయం! అసలు నరకమంటూ, ఒకటి వున్నదో లేదో కాని, యిలాంటి అర్థంలేని నమ్మకాలతో భయపడడం కన్న, మరొక నరకం వుండదు," అని, గట్టిగా వాదించసాగాడు.

కేశవయ్య, శివయ్యతో అప్పటికి మరింత వాదం పెంచకుండా అంతటితో వూరుకున్నాడు.

జొన్నలగడ్డ రత్న

ఇది జరిగిన కొన్నాళ్ళకు, స్నేహితు లిద్దరూ ఒక రోజున, సరుకులు కొనుగోలు చేసేందుకు, సమీపంలో వున్న పట్టణానికి వెళ్ళారు.

అక్కడ ఎవరి పనుల్లో వాళ్ళు.. వర్తక వ్యాపారాలు జరిగే బజారుల్లో తిరుగు తూండగా, క్షణక్షణానికీ ఎక్కువవుతున్న ఎండ తీవ్రతవల్ల, శివయ్యకు విపరీతమైన అలసట ప్రారంభమై, క్రమంగా కళ్ళు బైర్లుకమ్మడం మొదలయింది.

శివయ్య అతి కష్టం మీద ఒక్కొక్క అడుగే వేస్తూ, ఎక్కడైనా నీడపట్టు దొరుకుతుందేమో అని వెతుకుతూ, హఠాత్తుగా వీధి మధ్యలో సొమ్మసిల్లిపడి పోయాడు.

ఇది చూసి, సమీపంలో వున్న తన దుకాణంలోంచి, కమ్మరికోటయ్యగబగబా అక్కడికి వచ్చాడు. అతడు శివయ్యను రెండు చేతుల మీదా ఎత్తుకుని, తన దుకాణంలోకి తీసుకుపోయి పడుకో బెట్టాడు. తర్వాత శివయ్యకు స్పృహ రావడం కోసం ముఖం మీద చల్లనినీళ్ళు చిలకరించాడు.

కొంతసేపయాక, శివయ్యకు కాస్త స్పృహవచ్చి కళ్ళు తెరిచాడు. అతడికి ఎదురుగా మసిబారిన నల్లని ముఖంతో, భయంకరంగా వున్న గుబురుమీసాలతో, కమ్మరికోటయ్య కనిపించాడు. ఆ పక్కనే కొలిమిలో కణకణమండే బొగ్గుల మధ్య, ఇనుపకమ్మి ఒకటి కాలుతున్నది.



ఇదంతా చూసి శివయ్య, తాను చని పోయి యమలోకం చేరుకున్నానని భ్రాంతి పడుతూ, ఒక్కగావుకేక పెట్టాడు.

కోటయ్య, అతణ్ణి సమీపించి, ఏదో అడగబోయేంతలో, శివయ్య అతడు సాక్షాత్తూ యమభటుడే అయి వుంటాడని భయపడుతూ లేచి కూర్చుని, రెండు చేతులూ ఎత్తి, "నన్నెందుకు యిక్కడికి తీసుకువచ్చావు?" అని అడిగాడు.

కోటయ్య, శివయ్య తనకు కృతజ్ఞత చెప్పబోతున్నాడని, "నువ్వు దణ్ణాలు పెట్టడం దేనికి? నా ధర్మమేదో, నేను చేశాను," అని, తన పని చూసుకునేందుకు కొలిమి ముందుకు వెళ్ళి, ఇనపకమ్మీని నిప్పుల్లోంచి పైకి తీసి చూడసాగాడు.

ఎర్రగా కాలుతూన్న ఆ కమ్మీ కంట బడగానే శివయ్యకు, యమభటుడు తనకు వాతలు పెట్టబోతున్నాడన్న భయం కలిగింది. అతడు గడగడ వణికిపోతూ, "నేనేం పాపం చెయ్యలేదు. నా వంటి మీద వాతలు పెట్టకు!" అని గట్టిగా అరవసాగాడు.

ఆ కేకలు విని, దారే పోయేవాళ్ళు, కమ్మరిదుకాణం ముందు గుంపుగా గుమిగూడారు. కోటయ్య, వాళ్ళతో, "ఈ పెద్ద మనిషి ఎవరో, నాకు తెలియదు. వీధిలో కళ్ళు తిరిగి పడిపోతే, అయ్యో పాపం అని యిక్కడికి తీసుకు వచ్చాను. స్పృహ వచ్చింది మొదలు, యిదేదో యమలోక మైనట్టూ, నేను వాతలు పెట్టబోతున్నట్టూ



భ్రమించి, కేకలు పెడుతున్నాడు,'' అని చెప్పాడు నవ్వుతూ.

శివయ్యను వెతుకుతూ, ఆ సమయంలో అక్కడికి వచ్చిన కేశవయ్య, కమ్మరితో, ''ఈయన నా స్నేహితుడు. ఎండదెబ్బకు పైత్యం ప్రకోపించి అలా మాట్లాడుతున్నాడు,'' అన్నాడు.

ఈ మాటలు వింటూనే, చుట్టూ చేరిన జనం పెద్దగా నవ్వుకుంటూ వెళ్లిపోయారు.

ఆ తర్వాత స్నేహితు లిద్దరూ, కమ్మరి కోటయ్యకు కృతజ్ఞతలు చెప్పుకుని, తమ గ్రామానికి బయలుదేరారు.

దారిలో శివయ్య, కేశవయ్యతో, ''పాప పుణ్యాలు, స్వర్గనరకాల్లాంటి వాటి మీద, నాకు నమ్మకం లేదు. మరి, నేనా కమ్మరిని యమభటుడుగా, కొలిమిలో, కాలుతున్న ఇనపకమ్మీని చూసి, నరకమని ఊహించుకుని, ఎందుకు భయపడ్డానో అర్థం కావడం లేదు,'' అన్నాడు.

అందుకు కేశవయ్య, ''చూడు శివయ్యా! ఎలాంటి ప్రగల్భాలు పలికే వాడికైనా, చెడ్డపనులు చేస్తే పాపం చుట్టుకుంటుందన్న భయం, మనస్సులో ఏదో ఒక మూల తప్పకుండా వుండి తీరుతుంది. చనిపోయాననుకుని, కొన్ని నిమిషాలపాటు భ్రమలో వున్న నీచేత, నీ మనస్సు ఆ నిజం ఎలా పలికించిందో చూశావా?'' అన్నాడు.

''అవును, నువ్వు చెప్పింది నిజం,'' అన్నాడు శివయ్య తలాడిస్తూ.

"చనిపోయినవాళ్లు ఎక్కడికి పోయారో, చూసినవాళ్ళు లేరు. కాని, నరకాన్ని గురించిన, ఈ భీతి మూలంగా, చాలా మంది, తాము చేసిన చెడు గుర్తుకు వచ్చినప్పుడు, ఆ నరకాన్ని కొద్ది క్షణాల పాటైనా, యిక్కడే అనుభవిస్తారు,'' అన్నాడు కేశవయ్య.

శివయ్యకు, కేశవయ్య అన్న మాటల్లో ఎంతో వాస్తవం కనిపించింది. ఆ తర్వాత అతడు, తన వృత్తిలో ధర్మంగా ప్రవర్తిస్తూ, పదిమందిలో మంచివాడన్న పేరు గడించాడు.







# పేదవాడిసలహా

శివగిరిరాజు శ్రీదత్తుడు. ఆయన సభ చేసిన రోజు, విపరీతమైన తలపోటుతో పట్టు వేయించుకునేవాడు. ఆ రోజంతా మనసు చికాకుగా వుండేది. దీనికి కారణం, ఆస్థానపండితుడైన అనిరుద్ధుడు.

ఈ అనిరుద్ధుడు, అర్థరహితమైన శ్లోకాలు చదివీ, వ్యర్థప్రసంగాలు చేసీ, సభికులనూ, రాజునూ విసిగించేవాడు. రెండుతరాల నుంచీ ఆస్థానపండితుడుగా వుంటున్నందువల్ల, అనిరుద్ధుణ్ణి రాజు ఏమీ అనలేకపోయేవాడు. అయితే, శ్రీదత్తుడికి, అవకాశం దొరికితే అనిరుద్ధుణ్ణి వదిలించుకోవాలని వున్నది.

ఇలా వుండగా, ఒకనాడు పేరిశాస్త్రి అనే పేద బ్రాహ్మడు, శ్రీదత్తుడి దర్శనం చేసుకుని, "మహారాజా, అక్కడా, యిక్కడా పౌరోహిత్యం చేస్తూ బతుకు వెళ్ళబుచ్చే నాకు, దేవుడు గంపెడు పిల్లలనిచ్చాడు. వాళ్ళకు రోజూ రెండు పూటలా తిండి పెట్టలేని, నా చేతకాని తనానికి ఒకపక్క కుమిలిపోతూంటే, మరొక సమస్య ఎదురయ్యింది." అన్నాడు.

"ఏమిటా సమస్య?" అన్నాడు శ్రీదత్తుడు.

అందుకు పేరిశాస్త్రి, "నా సంతానంలో, ఒక ఆరేళ్ళవాడు నిద్రలేచింది మొదలు, రాత్రి పడుకునేవరకూ, ఒకటే ఏడుపుతో ప్రాణాలు తోడేస్తున్నాడు. వాడి బాధపడలేక, ఒక్కొక్కసారి ఎటయినా పారిపోవాలనిపిస్తుంటుంది. ఏలినవారు, నన్ను ఈ బాధ నుంచి విముక్తుణ్ణి చేయమని అర్థించడానికి వచ్చాను," అన్నాడు.

ఈ మాటలు విన్న శ్రీదత్తుడు, ఆ పిల్లవాణ్ణి ఎలాగైనా అనిరుద్ధుడికి అంటగడితే, పీడ విరగడవుతుందని ఆలోచించి, "సరే, వాణ్ణి తీసుకురా. వాడు, నా దగ్గిర వున్నంత

మల్లపరపు మనోహరరెడ్డి



వరకూ, నీకు రోజూ పది వరహాలిస్తాను,'' అని చెప్పాడు.

తన బాధ వదలడమేకాక, రోజుకు పది వరహాలు వస్తున్నందుకు, పేరిశాస్త్రి సంతోషపడి, ఆ మర్నాడే తన కొడుకును తెచ్చి, శ్రీదత్తుడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

శ్రీదత్తుడు, అనిరుద్ధుణ్ణి పిలిపించి, ''మీరు, నాకొక సహాయం చేసి పెట్టాలి. దిక్కూమొక్కూ లేని వీణ్ణి, మీ ఇంట వుంచుకుని, పాండిత్యంలో, మీ అంతవాణ్ణి చేసి, నాకు చూపాలి!'' అన్నాడు.

''అదెంత భాగ్యం, రాజా! వీడు, నా శిష్యరికంలో, నన్ను మించిన పండితుడయ్యాడని, మీరే అనేలా చేస్తాను, చూడండి!'' అని పేరిశాస్త్రికొడుకును తీసుకుపోయాడు అనిరుద్ధుడు.

ఆ మరుసటి రోజు, పేరిశాస్త్రికొడుకు నిద్రలేస్తూనే, పెద్దగా ఏడవడం ప్రారంభించాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా వాణ్ణి సముదాయించడం, అనిరుద్ధుడి చేత కాలేదు. ఆ రోజు, వాడి ఏడుపుతో తల దిమ్మెక్కి, ఆయన సభకు వెళ్ళలేకపోయాడు. అందువల్ల, రాజుగారి సభ ఎంతో ఆనందంగా జరిగింది.

రెండవ రోజున, పేరిశాస్త్రికొడుకు ఏడుపుతో, అనిరుద్ధుడికి బుర్ర పని చెయ్యక సభకు వెళ్ళాలని అనిపించనేలేదు.

ఇలా, వారం తిరక్కముందే, పేరిశాస్త్రి కొడుకు ఏడుపుకు తట్టుకోలేక మతి చలించి, ఎటో వెళ్ళిపోయాడు అనిరుద్ధుడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, శ్రీదత్తుడికి మరొక సమస్య ఎదురయ్యింది. అదేమిటంటే—శివగిరికి ఎగువనున్న, సువిశాలమైన సుందరగిరి రాజ్యంలో, ప్రతి ఏటా క్షాత్రవిద్యల్లో పోటీలు నిర్వహించబడేవి. ఆ పోటీలకు శ్రీదత్తుడి యిద్దరు కొడుకులకూ ఆహ్వానం అందింది. శ్రీదత్తుడి కొడుకులిద్దరూ ఆ పోటీల్లో పాల్గొని, ఓడిపోయారు. అన్ని విద్యల్లో ప్రథముడుగా, సుందరగిరి యువరాజు ఎన్నికయ్యాడు.

ఈ ఎన్నిక పక్షపాతంతో జరిగిందనీ, సుందరగిరి రాజు, మోసగించాడనీ, శ్రీదత్తుడి కొడుకులు, ఆయనను నిందించారు. ఇందుకు సుందరగిరి రాజు మండిపడి, శివగిరి మీద యుద్ధం ప్రకటించాడు.

ఈ ప్రమాదం నుంచి ఎలా బయటపడడమా అని, ఆలోచించసాగాడు, శ్రీదత్తుడు. ఆయన రాజ్యం కంటే, సుందరగిరి రాజ్యం, మూడురెట్లు పెద్దది. పైగా, ఆ రాజ్యం ఎగువనున్నందున, నీటి వనరులన్నీ అక్కడి నుంచే అందుతున్నాయి. అటువంటి రాజ్యంతో యుద్ధమంటే, తాను ఓడి అడవులపాలు కావలసి వస్తుందని, శ్రీదత్తుడికి తెలుసు.



అందుచేత, ఆయన రాజ్యంలోని ప్రముఖులను పిలిపించి, యీ జటిల సమస్యకు పరిష్కారమార్గం గురించి మంతనాలు జరపసాగాడు.

ఈ సంగతి ఆనోటా, ఈనోటా విన్న పేరిశాస్త్రి, రాజును దర్శించాడు.

శ్రీదత్తుడు, అతడితో, "నీ సహాయం వల్ల, రెండు తరాల పీడ వదిలించుకున్నాను. ఇప్పుడు, యీ యుద్ధం సమస్య వచ్చిపడింది. ఈ సమస్యను కూడా, నువ్వే పరిష్కరించగలవేమో చూడు!" అన్నాడు.

"మహారాజా, నాకు యిదొక పెద్ద సమస్యగా తోచడం లేదు. గంపెడు పిల్లలతో వేగుతున్న నాకు, సూక్ష్మంగా ఆలోచిస్తే, యిటువంటి సమస్యలు, రోజూ ఎదురవుతూనే వున్నవి. వాటిని మరెవరి సాయం లేకుండా, నేనే పరిష్కరించుకోగలుగుతున్నాను," అన్నాడు పేరిశాస్త్రి.

"ఏ విధంగా?" అన్నాడు శ్రీదత్తుడు.

"నా పిల్లలు, తోటిపిల్లలతో ఆటలాడుతూ, ఎవరో ఒకర్ని కొట్టి, రోజూ ఇంటి మీదికి తగువులు తెస్తూ వుంటారు. నేను ఆవేశంతో, ఆ వచ్చినవాళ్ళ మీద తగువు పెట్టుకోకుండా, లౌక్యంగా వాళ్ళ చేతులు పట్టుకుని, తగువులు లేకుండా చేస్తూంటాను. మీ సమస్య కూడా, అలాంటిదే!" అన్నాడు పేరిశాస్త్రి.

శ్రీదత్తుడికి, అతడి మాటల్లోని మర్మం బోధపడింది. ఆయన మర్నాడే, సుందర గిరి రాజును స్వయంగా కలుసుకుని, "నా పిల్లలు తెలియక తొందరపడినందుకు మిమ్మల్ని క్షమాపణ వేడుకుంటున్నాను. సోదరసమానులైన మీతో, నాకు యుద్ధమా! మీరు యుద్ధానికంటూవస్తే, ప్రతిఘటించకుండా, నా రాజ్యం మీకు ధారాదత్తం చేస్తాను," అన్నాడు.

ఇందుకు సుందరగిరి రాజు సంతోషించి, యుద్ధప్రయత్నాలు విరమించుకున్నాడు.

మరి కొంతకాలం గడిచాక, శ్రీదత్తుడు తన కొడుకులలో ఒకడికి రాజ్యం అప్పగించి, తాను విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు. అయితే, కొడుకు లిద్దరూ కవలలు కావడంవల్ల, రాజ్యం ఎవరికివ్వాలన్న సమస్య ఎదురయింది. వాళ్లు, రాజ్యం నాదంటే నాదని పోట్లాడుకోసాగారు.

ఈ సమస్యను పరిష్కరించగలడేమో చూద్దామని, శ్రీదత్తుడు పేరిశాస్త్రికి కబురంపాడు.

పేరిశాస్త్రి సంగతి విని, "మహారాజా, రాజ్యం కోసం నీ కొడుకుల పోట్లాట చూస్తూంటే, మిఠాయికోసం పోట్లాడుకునే, నా పిల్లలు గుర్తొస్తున్నారు. ఎప్పుడైనా, నేనొక మిఠాయిపొట్లం తీసుకువెళితే, నా గంపెడు పిల్లలూ, నాకంటే, నాకని కొట్లాటకు దిగుతారు. అందువల్ల, నేను ఆ పొట్లాన్ని రహస్యంగా ఇంట్లోకి తీసుకు వెళ్ళి, నా పిల్లలు ఎంతమందో, అన్ని చిన్న పొట్లాలు కట్టి—అందరికీ పంచి పెడతాను," అని చెప్పాడు.

శ్రీదత్తుడు, పేరిశాస్త్రి మిఠాయి పంపకంలోని అంతరార్థం వెంటనే గ్రహించాడు. ఆయన రాజ్యాన్ని రెండు భాగాలుగా చేసి, ఇద్దరు కొడుకులనూ రాజులుగా చేసి, సమస్యను చాలా తేలికగా పరిష్కరించాడు.

ఇంత చక్కగా సమస్యకు పరిష్కార మార్గం చూపినందుకు, శ్రీదత్తుడు పేరిశాస్త్రికి ఎన్నో విలువైన కానుకలిచ్చి, అతడి పేదరికాన్ని రూపుమాపాడు.






## 18

[జ్వాలాద్వీపం నుంచి ఉగ్రదత్తుడు తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడికి సహాయం రావలసిందిగా వార్త పంపాడు. వెంటనే ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లతో పడవల మీద జ్వాలా ద్వీపానికి బయలుదేరాడు. పడవలు ఒక పగలూ, రాత్రీ ప్రయాణం చేసి సముద్ర మధ్యంలో వుండగా, ఒక భయంకరపక్షి వాళ్ళ మీద దాడి చేసేందుకు వేగంగా వచ్చింది. తరవాత—]

భయంకర పక్షిని చూస్తూనే రాక్షసులు హడలెత్తిపోయారు. ఉగ్రాక్షుడు ఉరుము లాంటి పెద్ద గొంతుతో, ''కాగడాలను చమురులో తడిపి, వెలిగించండి!'' అని కేక పెట్టాడు. వెంటనే రాక్షసులు కాగడాలు వెలిగించారు. భయంకర పక్షి మీద వున్న రౌతులు ఆకాశంలో అంత ఎత్తున ఎగురుతూనే, పడవుల మీద వున్న రాక్షసుల మీదికి ఈటెలూ, పెద్ద పెద్ద రాళ్లూ విసరసాగారు. ఈ విధంగా ఓ పావుగంట కాలం పోరాటం జరిగిన తరవాత భయంకరపక్షి మీద వున్న పులిరాయుళ్ళు, పడవల మీద దిగబోతున్నవాళ్ళలా పక్షిని సూటిగా కిందికి దూకించి, అంతలోనే పైకి ఎగిరిపోతూ కొంతసేపు అట్టహాసం చేసి, చివరకు జ్వాలాద్వీపం దిక్కుగా వెళ్ళిపోయారు.

ఏ కారణం వల్లనో ఆ పగలూ, రాత్రీ కూడా పులిరాయుళ్ళు మళ్ళీ రాక్షసుల



మీద దాడికి రాలేదు. మూడవరోజు సూర్యోదయం అయేసరికి పడవలు జ్వాలాద్వీపాన్ని సమీపించినై.

"పడవల్ని మరికొంతదూరం పడమటి దిక్కుగా పోనివ్వండి. అక్కడ మండుతున్న రెండు అగ్నిపర్వతాల మధ్యగా ఒక లోయ వున్నది. ఆ ప్రాంతాన మనం తీరం చేరి, ఆ లోయకుండా ద్వీపం మధ్యకు వెళ్ళవచ్చు." అన్నాడు రాక్షసులకు దారి చూపవచ్చిన భల్లూకరాయుడు.

భల్లూకరాయుడు చెప్పినట్టే పడవలు తీరాన్ని అంటిపెట్టుకుని మరి కొంచెం ముందుకు వెళ్ళేసరికి, రెండు అగ్ని పర్వతాల మధ్యగా పాడవైన లోయ ఒకటి కనిపించింది. కాని, ఉగ్రాక్షుడూ, భల్లూకరాయుడూ ఆశించినట్టు లోయ నిర్మానుష్యంగా లేదు. లోయ ముఖద్వారాన్ని ఆక్రమించుకుని వున్న పులిరాయుళ్ళతో, భల్లూకరాయుళ్ళు హోరాహోరి పోరాడుతున్నారు. కొన్ని భయంకర పక్షులు లోయకు చివర వున్న భల్లూకరాయుళ్ళ మీద దాడి చేస్తున్నవి.

రాక్షసులందరూ పడవలు దిగి తీరం చేరేసరికి, పులిరాయుళ్ళు లోయలో పోరాడుతూ భల్లూకరాయుళ్ళ మధ్యగా దారి చేసుకుని ద్వీపం లోపలికి పారిపోసాగారు. భల్లూకరాయుళ్ళు అందిన వాళ్ళను అందినట్టు చంపుతూ, రాక్షసులున్న చోటుకు చేరారు. అందరికన్న ముందున్న భల్లూకరాయుణ్ణి చూస్తూనే, ఉగ్రాక్షుడు అదిరిపడి, "ఉగ్రదత్తా! ఏమిటీ వేషం?" అంటూ అతడి చేతులు పట్టుకుని పైకెత్తి భుజం మీద కూర్చోపెట్టుకున్నాడు.

తమ ప్రబల శత్రువైన ఏకపాదుడితో పోరాడేందుకు రాక్షసులు సహాయం రావటం భల్లూకరాయుళ్ళకందరికీ ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. ఉగ్రదత్తుడు నాలుగు మాటల్లో శత్రుపక్ష బలాన్ని గురించి, తన పెంపుడు తండ్రితో చెప్పి, భల్లూకరాయుళ్ళ నాయకుడైన కంధుణ్ణి

పరిచయం చేస్తూ, "ఈయనే వీళ్ళ నాయ కుడు. నన్ను పులిరాయుళ్ళ నుంచి కాపాడాడు," అన్నాడు.

కంధుడు ఉగ్రాక్షుడికి ప్రణామం చేసి, "ఉగ్రాక్షా! నీ రాకవల్ల మాకు కొండ గుహల్లో, బిలాల్లో చీకటిబతుకు తప్పింది. ఏకపాదుడి వంటి మహాక్రూరుడు యిక పుట్టబోడు. కేవలం బానిసలు చేసే కాయ కష్టం మీద బతుకుతూ, ప్రపంచం మీద అధికారం చెలాయించాలని చూసే, ఏక పాదుణ్ణీ అతడి మిత్రులైన కరవీరుడూ, నాగవర్మలను నాశనం చేయగలిగితే, మీ దేశానికీ, ఈ జ్వాలాద్వీపానిక్కూడా ఎంతో క్షేమం కలుగుతుంది," అన్నాడు.

"దానికి ఆలస్యం ఎందుకు? వాడి కోటను ముట్టడిద్దాం. మీరు దారి చూపితే చాలు," అన్నాడు ఉగ్రాక్షుడు, తన పెంపుడు కొడుకును భుజం మీది నుంచి దించుతూ.

"అది అంత తొందరపడి చేసే పని కాదు. నిదానంగా ఆలోచిద్దాం. ఇప్పుడు వాడి చేతిలో చంద్రసేన అనే రాకుమార్తె వున్నది. ఆమెకు హాని కలక్కుండా చూడాలి. అంతేకాక, అరుద్రుడనే మీ వాడొకడు, ఎప్పుడూ వాణ్ణి అంటిపెట్టుకు తిరుగుతూ, మీ గుట్టుమట్లన్నీ వాడికి చెపుతున్నట్టు, అక్కణించి పారిపోయి




వచ్చిన మీ దేశం వాళ్లు చెపుతున్నారు," అన్నాడు కంధుడు.

అరుద్రుడు ద్రోహిగా మారాడని వింటూనే ఉగ్రాక్షుడు కళ్ళెర్ర చేసి, "రుద్రుడెక్కడ?" అని హుంకరించాడు.

రుద్రుడు భయపడుతూ అతడి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

"ఏమిరా, అరుద్రుడు యింత ద్రోహి ఎలా అయాడు? వాడూ నీవూ ప్రాణ స్నేహితులు గదా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు.

"వాడికి నేనొక్కణ్ణే ఏమిటి, ఉగ్ర దత్తుడు కూడా ప్రాణస్నేహితుడే! బహుశా, చంద్రసేనను పెళ్ళాడాలనే ఆశతో, వాడు




కంధుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు తికమకపడ్డాడు. అతడికి వెంటనే వాటి భావం అర్థం కాలేదు. కాని, ఆ అర్థం స్ఫురించగానే అతడు నివ్వెరపోయాడు. "కంధా, యిలాంటిది నే నెక్కడా విన లేదు. అయితే, ఆ ఏకపాదుణ్ణి నెత్తురు చిందించకుండా చంపటం ఎలా?" అన్నాడు.

"మనలో కొందరు చావటానికి సిద్ధ పడాలి. కొండ శిఖరాన వున్న వాడి కోటలో జొరపడటం పెద్ద సమస్య కాదు. మనకూ కొన్ని భయంకరపక్షు లున్నవి గనక, శత్రువులు మనను వాటితో అడ్డగించలేరు. నీ బంట్లలో ఒక్కొక్కడు నూరుమంది పులిరాయుళ్ళను అవలీలగా చుట్ట చుట్టి దూరంగా పారవెయ్యగలడు. కాని, మనం కోటను వశపరుచుకుని, ఏకపాదుణ్ణి పట్టుకునేందుకు ప్రయత్నించటంలోనే ప్రమాదం వున్నది. వాడు కత్తితో శరీరం మీద కొన్ని గాట్లు పెట్టుకుని ఎదురయ్యా డంటే—మనలో ఒక్కరు కూడా ప్రాణా లతో అక్కడి నుంచి తిరిగి రాలేం," అన్నాడు కంధుడు.

"వాడు చాలా బలవంతుడు కూడానా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు.

"బలవంతుడా, ఛీ, ఛీ! వట్టి అర్భకపు వెధవ, పైగా ఒంటికాలువాడు! చేతికి

మనకు ద్రోహం తలపెట్టి, పులిరాయుళ్ళ నాయకుడి పక్షం అయి వుంటాడు," అన్నాడు రుద్రుడు బెదురుగా.

"చంద్రసేన నా కొడుకును పెళ్ళాడ వలసిందే! దానికి తిరుగు లేదు. ఆ ఆరుద్రుణ్ణి నరికి ఉప్పుపాతర్లో వేస్తాను," అంటూ ఉగ్రాక్షుడు రంకెలు పెట్టసాగాడు.

"శాంతించు, ఉగ్రాక్షా! ఇంతవరకూ నీకు చెప్పకుండా దాచిన రహస్యం ఒకటి వున్నది. ఏకపాదుణ్ణి చంపటం తేలిక కాదు. వాడికో శక్తి వున్నది. వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!" అన్నాడు కంధుడు నిస్పృహగా.



దొరికితే పదేళ్ళ కుర్రవాడు వాణ్ణి, కోట గోడల మీది నుంచి కిందికి దొర్లించ వచ్చు,'' అన్నాడు కంధుడు.

''అయితే, నా బంట్లలో కొందరు చావటానికి సిద్ధపడతారు. మనం వాడి కోటలోకి వెళ్ళిన తరవాత, వాడు ఎక్కడ వున్నాడో చూస్తూ, ఒకడు ముందుకు నడుస్తూంటాడు. మనం అందరం తలలు ఎత్తకుండా నేలవంక చూస్తూ, వాడి వెనక నడుస్తాం. ముందున్నవాడు, ఆ దుర్మార్గుణ్ణి చూస్తూనే ఎక్కడ వున్నదీ కేక పెట్టి, చచ్చినా ఫరవాలేదు. మనం కళ్ళు మూసుకునే వాణ్ణి చుట్టు ముట్టి, కళ్ళు మూసుకునే వాడి ప్రాణాలు తీద్దాం,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''ఆ తరవాత, మనం కళ్ళు తెరవగానే రక్తం కనబడుతుంది గదా?'' అని ప్రశ్నించాడు కంధుడు తల అడ్డంగా తిప్పుతూ.

''ఇది చాలా గడ్డు సమస్య! ఇక్కడ వుండి ఆలోచించలేం. వాణ్ణి చంపిన తరవాత అదంతా చూద్దాం. వాడి కోటకు దారి తీయండి,'' అంటూ ఉగ్రాక్షుడు చకచకా ముందు నడిచాడు.

భల్లూకరాయుళ్ళు దారి చూపగా అందరూ లోయలో కొంత దూరం నడిచి, అక్కడ ఎడమపక్కగా కొండపాదంలో వున్న ఎగుడు దిగుడు రాళ్ళ మీదుగా ఎక్కి, శిఖరాన వున్న కోటకేసి పోసాగారు. ఆకాశంలో ఎక్కడా భయంకర పక్షుల జాడగాని, కొండ మీద పులిరాయుళ్ళ అచూకీ గానీ లేదు. అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది.

''ఏకపాదుడేదో ఎత్తు వేశాడు! శరీరమంతా నెత్తురు చేసుకుని, హఠాత్తుగా వాడు కోట గోడ మీద కనిపించి, మనను చంపాలని పథకం వేసి వుండొచ్చు,'' అన్నాడు కంధుడు.

''ముందు నడిచేవాడు తప్ప, తతిమ్మా వాళ్ళెవరూ కోట గోడలకేసి చూడకండి!'' అని ఉగ్రదత్తుడు కేక వేశాడు.



ఆ వెంటనే, "ఉగ్రదత్తా! చంద్రసేన జారవిడిచిన తాళ్ళ ఆధారంతో పైకి రండి! ఏకపాదుణ్ణి తోలు సంచీలో పెట్టి మూతి బిగించాను. భయం లేదు. కాని, ద్రోహి నాగవర్మ, కరవీరుడూ, ఈ ప్రాంతాన ఎక్కడో పొంచి వున్నారని నా భయం!" అంటూ అరుద్రుడు కేక పెట్టాడు. ఆ వెంటనే కత్తులు ఒకదాన్నొకటి తాకిన శబ్దమైంది. చంద్రసేన ఒక చేత్తో కత్తి పైకెత్తి, గోడ మీది నుంచి, "అరుద్రుడు కరవీరుడితో పోరాడుతున్నాడు. ఇదుగో, ద్రోహి నాగవర్మ!" అంటూ కోట లోపలి ఆవరణలోకి దూకింది.

ఆ విధంగా అందరూ కోట గోడలను సమీపించేసరికి, వాటి మీద ఏదో కలకలం వినబడ సాగింది. అయినా ఎవరూ తలలు ఎత్తలేదు. కొద్దిసేపటికల్లా గోడల మీది నుంచి ఏకపాదుడి గొంతు కంచులా మార్మోగింది; "ఇదుగో, అందరూ చూడండి! సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను యింత ఎత్తు నుంచి అమాంతం కిందికి పడవేస్తున్నాను."

ఏకపాదుడి బెదిరింపు వింటూనే ఉగ్రాక్షుడితోపాటు అందరూ నివ్వెర పోయారు. కాని, ఎవరూ తలలు ఎత్త లేదు. ఇంతలో కోట గోడల మీది నుంచి, "ద్రోహం! మోసం!" అన్న అరుపూ,

ఉగ్రదత్తుడూ, ఉగ్రాక్షుడూ తమ వాళ్ళను హెచ్చరిస్తూ కేకలు పెట్టి, కోట గోడ నుంచి కిందికి చంద్రసేన జార్చిన తాళ్ళు పట్టుకుని గబగబా పైకి పాకారు. వాళ్ళు కోట ఆవరణలోకి దిగేసరికి, కరవీరుడితో అరుద్రుడూ, ద్రోహి నాగవర్మతో చంద్రసేనా కత్తియుద్ధం చేస్తున్నారు. ఉగ్రాక్షుడు ఆ దృశ్యం చూస్తూనే పొంగిపోయి, "ఇదుగో, వస్తున్నాను, చంద్రసేనా! క్షత్రియ కన్య వనిపించుకున్నావు. నీ కాబోయే అత్తగారు లోగడ ఈ విధంగానే కత్తి దూసి మేనా దిగి, పులిరాయుళ్ళతో యుద్ధం చేయటం నా కళ్లారా చూశాను!" అంటూ నాగవర్మ కేసి రాతి

గద ఎత్తబోయేంతలో, వాడు చంద్రసేన విసిరిన కత్తి గుండెల్లో తగలగా, "అబ్బా!" అంటూ వెనక్కు పడిపోయాడు. రాక్షసుల్ని చూసి పారిపోబోయిన కరవీరుడి వెన్నులో అరుద్రుడు విసిరిన కత్తి దిగింది. వాడు "అమ్మా!" అంటూ ముందుకు పడిపోయాడు.

కంధుడు మహోత్సాహంతో ఏకపాదుడున్న తోలు సంచిని పైకెత్తి, "ఏకపాదా! లోపల ఉక్కగా వున్నదా? ఇదుగో, ఇప్పుడే నిన్ను ఆ మండే అగ్ని పర్వత ముఖంలో జారవిడుస్తాను! నీకూ, లోకానికూడా హాయిగా వుంటుంది," అంటూ దాపులనే వున్న అగ్నిపర్వతం కేసి పరిగెత్తాడు.

"నేను, మీపట్ల ద్రోహిగా నటించబట్టే, ఏకపాదుడు నన్ను నమ్మాడు. చంద్రసేనకు ప్రాణాపాయం కలగనున్నదని బెదిరించి, మీరు కోట గోడలకేసి చూడగానే, తన శరీరం మీద గాట్లు పెట్టుకుని మిమ్మల్నందర్నీ చంపాలని వాడు చూశాడు. ఇలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్న నేను, వెనక నుంచి మీద పడి, వాణ్ణి తోలు సంచీలో పెట్టి మూతి బిగించాను," అన్నాడు అరుద్రుడు. అతడి తెలివితేటల్ని అందరూ మెచ్చుకున్నారు.

* * *

ఉగ్రాక్షుడూ, ఉగ్రదత్తుడూ, చంద్రసేనా తమ పరివారంతో కలిసి తమ దేశం చేరగానే, చిత్రసేనుడూ, సామంతరాజు సుదర్శనుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు. ఒక శుభ ముహూర్తాన ఉగ్రదత్తుడికీ, చంద్రసేనకూ వైభవంగా వివాహం జరిగింది. ఆ వివాహానికి కంధుడు వెలలేని కానుకలు తీసుకుని, కపిలపురానికి వచ్చాడు. ఉగ్రదత్తుడు తన మామగారయిన సుదర్శనుడి సామంత రాజ్యానికీ, తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడి అరణ్య సీమకూ రాజై చాలాకాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు. —(అయిపోయింది)






# రాజ్యరక్షణ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎంతో ప్రమాదకరమైన యిటువంటి కఠిన కార్యానికి, నువ్వెందుకు పూనుకున్నావో, నాకు తెలియదు. నిన్ను చూస్తూంటే, చపలబుద్ధులైన కొందరు రాజకుమారులు గుర్తుకు వస్తున్నారు. అలాంటి వారిలో ఒకడైన శివదత్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

అగ్నిదత్తు డనే రాజు, సుసంపన్నమైన నీలసాగరరాజ్యాన్ని పాలిస్తూండేవాడు. ఆయనకు శివదత్తుడు, శాంతిదత్తుడు అనే యిద్దరు కుమారులు. అన్నదమ్ము లిద్దరూ, అన్ని విద్యలలోనూ ఆరితేరారు. అయితే,

## బేతాళ కథలు



శివదత్తుడిలో వినయ, దయా గుణాల పాలెక్కువగా వుండేది. ఆ కారణం వల్ల, అందరికీ అతడిపట్ల ఎంతో అభిమానం. రాజు అగ్నిదత్తుడు, కొంతకాలం గడిచాక శివదత్తుడు, తనకు రాజ్యపాలనా విషయాల్లో, సహాయకారిగా వుండగలడన్న నమ్మకంలో వుండేవాడు. అయితే, శివదత్తుడు తన కాలాన్నంతా వేద, శ్రుతి, పురాణాలు పఠించడంలోనూ, భగవధ్యానంలోనూ గడిపేవాడు.

ఇలా కొంతకాలం గడిచాక, రాజు అగ్నిదత్తుడు, శివదత్తుణ్ణి యువరాజుగా ప్రకటించి, అతడికి రాజ్యరక్షణాశక్తిని మరింత బలపరిచే కార్యం అప్పగించాలనుకున్నాడు. ఇందుకు తగు కారణం లేకపోలేదు; పొరుగున వున్న సొరాజ్య పాలకుడు, సాధ్యమయితే నీలసాగరాన్ని ఆక్రమించుకునేందుకు, ఎంతో కాలంగా ఉచ్చులు పన్నుతున్నాడు.

అగ్నిదత్తుడు ఆదేశించగా, మంత్రి శివదత్తుణ్ణి కలుసుకుని, విషయమంతా వివరించాడు. ఇందుకు శివదత్తుడు ఏమాత్రం సంతోషించకపోగా, తనకు యిలాంటి రాచకార్యాలపట్ల ఆసక్తి లేదని జవాబిచ్చాడు.

అందుకు మంత్రి ఆశ్చర్యపోయి, "తమ నుంచి యిలాంటి జవాబు వస్తుందనుకోలేదు! ప్రజలందరూ, తమ యౌవరాజ్యాభిషేకం కోసం ఎదురు చూస్తున్నారు," అన్నాడు.

"నాకేమాత్రం ఆసక్తి లేదని, చెప్పా గదా," అన్నాడు శివదత్తుడు.

"రాజుగారికి పరిపాలనా విషయాల్లో, మీరు సాయం నిరాకరించారని తెలిస్తే, శత్రువులు రాజ్యంలో కుట్రలు రేపగలరు," అన్నాడు మంత్రి.

"ఏమైతే నాకేం! తమ్ముణ్ణి యువరాజుగా ప్రకటించమని, నా సలహా," అని జవాబిచ్చాడు శివదత్తుడు.

మంత్రి, రాజుతో జరిగింది చెప్పాడు. ఆయన నిర్ఘాంతపోయి, శివదత్తుణ్ణి పిలి

పెంచి, "నువ్వు యువరాజువయితే తప్ప, నాకు పరిపాలనా విషయాల్లో సలహాలివ్వడంసాధ్యపడదు. నాజ్యేష్ఠపుత్రుడుగా, అది నీ బాధ్యత. రెండవదేమంటే— రాజైన నేను, ఎవరు యువరాజో ఎన్నిక చేయవలసివుంది. అందుకు నిన్ను ఎన్నిక చేశాను. ముహూర్తానికి అవసరం అయిన ఏర్పాట్లు జరుగుతున్నవి. నువ్వు సిద్ధంకా!" అన్నాడు కఠినంగా.

శివదత్తుడు మౌనంగా వూరుకున్నాడు. ఆ మౌనాన్ని అందరూ, అంగీకారంగా భావించారు. కాని, మర్నాటి ఉదయం రాజభవనంలో అతడి జాడలేదు. రాజు ఆందోళనపడి, నౌకర్లచేత శివదత్తుడు సాధారణంగా తిరిగే ప్రదేశాలన్నీ వెతికించాడు. వాళ్ళు, రాజభవనం వెనకవున్న కొండశిఖరాన్నీ, నదీతీరాలనూ, భవనంలోని పెద్ద గ్రంథాలయాన్నీ—ఈ విధంగా అన్నీ వెతికిచూసి, అతడు కనబడలేదని రాజు అగ్నిదత్తుడికి తెలియబరిచారు.

తర్వాత రాజు దేశమంతటా శివదత్తుడి కోసం గాలింపజేశాడు. అయినా ఫలితం లేకపోయింది. రాజు దిగులుపడ్డాడు. రాణీ పుట్టెడు దుఃఖంతో అన్నాహారాలు మానింది.

కొద్ది రోజుల తర్వాత, ఒక బిచ్చగాడు శివదత్తుడి నుంచి లేఖ ఒకటి తెచ్చాడు. అది శివదత్తుడు తల్లిదండ్రులకు రాసినది. అందులో, యిలా వున్నది: "రాకుమారుడుగా నేను నిర్వహించవలసిన బాధ్యత





లేమిటో, నాకు తెలియనివికాదు. అయితే, వాటికన్న అంతరాత్మ ఆదేశం మరీ ముఖ్యమైనది, జవదాటరానిది. అందు వల్లనే నేను, తల్లిదండ్రుల్నీ, ఆత్మ బంధువుల్నీ పరిత్యజించి సన్యాసం స్వీక రించాను. క్షమించకోరుతున్నాను.''

ఈ లేఖ శివదత్తుడి తల్లిదండ్రులకు, యింతింతనరాని దుఃఖం కలిగించింది. అయినా వాళ్ళు, తమ కుమారుడెక్కడో ఒకచోట క్షేమంగా వున్నాడు కదా అని తృప్తిపడ్డారు.

ఇలా ఐదు సంవత్సరాలు గడిచాక, అగ్నిదత్తుడు వ్యాధిగ్రస్తుడయ్యాడు. ఆ పరిస్థితుల్లో, ఆయన రెండవ కుమారుడైన శాంతిదత్తుడు, రాజ్యపాలనా వ్యవహారాల్లో, తండ్రికి సాయం చేస్తూ వచ్చాడు. అయితే, మరి ఐదేళ్ళకు రాజు అగ్నిదత్తుడు మరణించడం జరిగింది. శాంతిదత్తుడు నీలసాగరరాజ్యానికి రాజుగా అభిషిక్తుడయ్యాడు.

శాంతిదత్తుడు గుణవంతుడే గాని, సమర్థుడైన పాలకుడు మాత్రం కాదు. ఒకసారి దేశంలో వానలు లేక కరువు వచ్చింది. శాంతిదత్తుడికి ముందు చూపు లేని కారణంగా, అతడు పొరుగుదేశాల నుంచి తిండిగింజలు తెప్పించి, నిల్వ చేయలేక పోయాడు. రాజ్యమంతటా అల్లరులు చెలరేగినై.

ఇలాంటి అవకాశం కోసం ఎదురు చూస్తున్న సౌరాజ్యపాలకుడు, నీలసాగర రాజ్యం మీద దాడికి సన్నాహాలు చేయ సాగాడు. ఇది విన్న నీలసాగరరాజ్య ప్రజల్లో కలవరం పుట్టింది. ఇటువంటి కష్టసమయంలో, శాంతిదత్తుడు హఠాత్తుగా రోగగ్రస్తుడయాడు.

రాజమాతకు ఏమి చేయాలో తోచక దిగులుపడసాగింది. అప్పుడు మంత్రులలో ఒకరు ఆమెతో, ''మహారాణీ, ఈ క్లిష్ట పరిస్థితుల్లో రాజ్యాన్ని కాపాడగలవారు ఒకే ఒకరున్నారు. ఆయన పేరు, మీరూ వినేవుంటారు—జ్ఞాని అద్భుతేశ్వరస్వామి.

ఆయన దీవించాడంటే, యిక తిరుగంటూ వుండదు,'' అని చెప్పాడు.

రాజమాత, యీ జ్ఞాని గురించి విని వున్నది. కొన్ని సంవత్సరాల కిందట, కట్టెలు కొట్టి అమ్ముకు జీవించేవాళ్ళు కొందరు, గంధపుచెట్టు కోసం వెతుకుతూ, అరణ్యంలో చాలా దూరం వెళ్ళారు. అక్కడ వాళ్ళకు గంధపుచెట్టు మొదట్లో, ఒక చీమలపుట్ట కంటబడింది. చెట్టును మొదలంటా నరికే ప్రయత్నంలో, వాళ్ళు చీమలపుట్టను తవ్వారు. అందులో నుంచి, ఆ జ్ఞాని బయటికి వచ్చాడు.

ఈ అద్భుతం చూసి విస్మయం చెందిన కట్టెలవాళ్ళు, ఆయనకు అద్భుతేశ్వర స్వామి అని పేరు పెట్టారు. ప్రజలు ఆయనను దర్శించి, ఆయన దీవనల కారణంగా, తమ తమ బాధల నుంచి విముక్తులు కాసాగారు. క్రమంగా అక్కడ ఒక ఆశ్రమం తయారైంది.

రాజమాత, మంత్రి సలహా గురించి ఆలోచిస్తున్నంతలో, శత్రుసైన్యం నీల సాగర సరిహద్దులకేసి వస్తున్నట్టు, చారుల ద్వారా వార్త అందింది. రాజమాత అప్పటి కప్పుడే బయలుదేరి, అద్భుతేశ్వరస్వామిని దర్శించి, కన్నీళ్ళతో, ''నీలసాగర రాజ్యాన్ని, తమరు తప్ప మరెవరూ రక్షించలేరు. సహాయపడండి,'' అని కోరింది.

స్వామి కొద్దిసేపు కళ్ళు మూసుకుని, తెరిచి, రాజమాతతో, ''అమ్మా, భయపడ





కండి. మీకుగాని, రాజ్యానికిగాని ఎలాంటి హానీ కలగదు," అన్నాడు.

తర్వాత ఆయన రాజధానికి వచ్చి, ప్రాణాలొడ్డి అయినా రాజ్యాన్ని కాపాడవలసిందిగా సైనికులను ఉద్బోధించి, రాజప్రాసాదం చేరి, శాంతిదత్తుడితో, "నీకెలాంటి జబ్బూలేదు; లేచి నిలబడు! అంతా మేలే జరుగుతుంది," అన్నాడు.

ఆ మరుక్షణం శాంతిదత్తుడు చిరునవ్వు నవ్వుతూ, మంచంలోంచి సంపూర్ణ ఆరోగ్యంతో లేచి నిలబడ్డాడు. తర్వాత సేనానాయకులను పిలిపించి, రాజ్యరక్షణకు ఏమిచేయాలన్న విషయమై తగు ఆజ్ఞలు జారీచేశాడు.

నీలసాగర సైన్యాలు, సరిహద్దులు దాటుతున్న శత్రుసైన్యాలను ఎదిరించి, అసమానధైర్యసాహసాలతో పోరాడినై. శత్రువులు ఓడి చిందరవందరగా పారిపోయారు. సౌరాజ్యదేశం నీలసాగర రాజ్యంలో కలుపుకోబడింది.

నీలసాగరసైన్యంమూడేమూడురోజుల్లో, ఈ విజయాన్ని సాధించింది. రాజ్యంలో ఆనందోత్సాహాలు పెల్లుబికినై.

జ్ఞాని అద్భుతేశ్వరస్వామి, రాజమాతను ఒంటరిగా కలుసుకుని, ఆమెకు సాష్టాంగ నమస్కారం చేసి, "అమ్మా, ఇక నేను వెళ్ళేందుకు అనుమతించగలవా ?" అని అడిగాడు.

రాజమాత కళ్ళలో నీరు తిరుగుతూండగా చిరునవ్వునవ్వి, స్వామి నుదుటిని ముద్దుపెట్టుకుని, "నీవంటి పుత్రుణ్ణి కన్న నేను అదృష్టవంతురాలిని. నీ బాధ్యత నెరవేర్చావు," అన్నది.

ఆ రాత్రే జ్ఞాని అద్భుతేశ్వరస్వామి, తన నివాసానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆ జ్ఞాని మరెవరో కాదు శివదత్తుడని తెలుస్తూనే వున్నది. ఆ కారణంగా, నాకు మరిన్ని అనుమానాలు కలుగుతున్నవి. అతడు, తన తల్లి కోరగానే రాజ్యరక్షణకు పూనుకోవడమే గాక, తిరిగి వెళ్ళేందుకు

అనుమతి కూడా అడిగాడు. అతడు సన్యాసిగదా! కొన్నేళ్ళక్రితం, అతడు రాజ్యాన్నీ, తల్లిదండ్రులనూ కూడా పరిత్యజించి సన్యాసం స్వీకరించాడు. అటువంటి వాడు, నీలసాగర రాజ్యరక్షణకు పూనుకోవడం ఆశ్చర్యం కలిగించడం లేదా? అంతేకాక, అతడు సౌరాజ్యదేశాన్ని, నీలసాగరరాజ్యంలో కలుపుకునేందుకు అభ్యంతరం కూడా చెప్పలేదు! ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఏ వ్యక్తి అయినా, తన అంతరాత్మ పిలుపు విన్నాడు, కుటుంబ, సామాజిక కట్టుబాట్లకు బద్ధుడై వుండవలసిన అవసరం లేదన్న మాట నిజం. అయితే, లోకంలో ఎవరూ కన్న తల్లిపట్ల వున్న బాధ్యతను మాత్రం విస్మరించ వీలులేదు. అందువల్లనే, శివదత్తుడు తల్లి దుఃఖాన్ని పోగొట్టి, తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళేందుకు, ఆమె అనుమతి కోరాడు. ఇక శత్రువుల నుంచి రాజ్యాన్ని కాపాడే విషయంలో—ఫలితం ఒకటే అయినా, మామూలు రాకుమారుడికీ, జ్ఞాని అయినవాడికీ చాలా భేదం వుంటుంది. నిజంగా శివదత్తుడే రాజై వుంటే, స్వార్థం కొద్దీ రాజ్యరక్షణకోసం శత్రువుతో పోరాడి వుండేవాడు. కాని, యిప్పుడతడు చేసినది, తన మహత్తర శక్తులతో, ఒక రాజకుటుంబాన్నీ, ప్రజలనూ కాపాడడం మాత్రమే. ఇలాంటి మేలు, అరణ్యంలోని తన ఆశ్రమంలో వున్నప్పుడు కూడా కష్టదశలో వున్నవారికి చేస్తూనే వున్నాడు. సౌరాజ్యాన్ని, నీలసాగర్‌లో విలీనం చేసుకోవడానికి, అతడు అభ్యంతరంచెప్పకపోవడానికి కారణం—సౌరాజ్యరాజు నీలసాగరరాజ్యాన్ని జయించ చూడడం. ఇది కేవలం పరిస్థితుల ప్రభావం!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# వేగానికి కారణం

ఒకరాజు, సభలోవున్నవాళ్ళను, "సృష్టిలోని ప్రాణులన్నింటిలోకీ, వేగమైనదేది?" అని అడిగాడు.

సభికులు రకరకాలుగా సమాధానాలు చెప్పారుగాని, రాజుకవేవీ తృప్తికలిగించలేదు.

అప్పుడు విదూషకుడులేచి, "నాకు తెలిసినంతవరకూ, నన్ను మించి వేగంగా పరిగెత్త గల ప్రాణి సృష్టిలోలేదు. నేనొకసారి పరుగుపందెంలో, ఒక లేడిని, కుందేలును, గుర్రాన్ని ఓడించాను," అన్నాడు.

రాజు, కోపంగా విదూషకుడివంక చూసి, "నేనడిగేది ప్రగల్భాలు కాదు. వాస్తవమైన సమాధానం," అన్నాడు.

"నేచెప్పింది నిజమే, ప్రభూ! ఆ సమయంలో, నేనంతవేగంగా పరిగెత్తడానికి కారణం లేకపోలేదు—నన్నొక పిచ్చికుక్క తరుముకున్నది," అని చెప్పాడు విదూషకుడు.

సభికులూ, రాజుకూడా పెద్దగా నవ్వారు. అప్పుడు విదూషకుడు వినయంగా, "ప్రాణికి సహజంగా వుండే వేగంవేరు, పిరికితనం ప్రసాదించే వేగంవేరు. ఈ విషయం ప్రభువులు ఒప్పుకోకపోవడానికి కారణం, పిరికితనమంటే ఏమిటో తెలియకపోవడమే!" అన్నాడు.

సభికులు హర్షధ్వానాలు చేశారు. రాజు చిరునవ్వు నవ్వి, విదూషకుడికి విలువైన బహుమతి యిచ్చాడు.

—కొప్పరపు నాగేశ్వరరావు



పిల్లలకు చందమామ నిర్వహిస్తూన్న పోటీలో సరదాగా పాల్గొనండి!

# మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

## ఉత్తేజకరమైన మూడు భాగాలలో

**పోటీ : 1**

గొప్ప భారతీయ రాజులు



**పోటీ : 2**

గొప్ప భారతీయ రాణులు



**పోటీ : 3**

గొప్ప భారతీయ జంటలు



**రూ. 1,30,000 ల విలువకు మించిన బహుమతులు గెలుచుకోండి!**

11 భాషలలో ప్రతి పోటీకీ గొప్ప బహుమతులు :

11 ప్రథమ బహుమతులు : 2,000 రూపాయలు స్కాలర్‌షిప్
11 ద్వితీయ బహుమతులు : 1,000 రూపాయలు స్కాలర్‌షిప్
11 తృతీయ బహుమతులు : 500 రూపాయలు స్కాలర్‌షిప్

**ఇవిగాక, బంపర్ ప్రైజులు**

ప్రథమ బంపర్ : 10,000 రూపాయలు స్కాలర్‌షిప్ •
ద్వితీయ బంపర్ : 5,000 రూపాయలు స్కాలర్‌షిప్ •
తృతీయ బంపర్ : 2,500 రూపాయలు స్కాలర్‌షిప్ •

• ఐదేళ్ళవరకు ఐదు సమాన వాయిదాలలో

220 కన్సొలేషన్ బహుమతులు : ఒక యేడాదిపాటు చందమామకు ఉచిత చందా

## పాల్గొనడం ఎలా?

మీ చరిత్ర పుస్తకాలనూ, పాత చందమామ కాపీలనూ దగ్గరుంచుకుని, కుటుంబ సభ్యులందరితోపాటు కూర్చుని ప్రారంభించండి! భారతీయ చరిత్రకూ, పురాణాలకూ సంబంధించిన సుప్రసిద్ధరాణుల చిత్రపటాలు కొన్ని ప్రక్కన ఇవ్వబడ్డవి. చిత్రపటాలను జాగ్రత్తగా పరిశీలించి చూసి, అవి ఎవరివో గుర్తించి, దానికి సరిపోయే సంఖ్యను బాక్సులో రాయండి. తరవాత ఇక్కడ వున్న ఆరు చిత్రపటాలలో ఒకదానిని ఎన్నుకుని, ఖాళీని పూర్తిచేసి, పక్క పేజీలో వున్న "నేను....... రాణిని ఎంతగానో మెచ్చుకుంటాను. ఎందుకంటే........" అన్న వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

ఉత్సాహకరమైన చక్కని సమాధానం రాయండి. ఉత్తమ సమాధానాలు బహుమతులు గెలుచుకుంటాయన్న విషయం గుర్తుంచుకోండి! మీ పేరూ, వయసూ, చిరునామా రాసి, పేజీని కత్తిరించి ఎంట్రీఫారాన్ని మాకు పోస్టు ద్వారా పంపండి. ఈ పోటీ ఫలితాలువచ్చేలోగానే, పోటీ:3 కోసం రానున్నచందమామసంచికలో చూడండి.

## పోటీ నిబంధనలు:

1. 16 సంవత్సరాల వయసుకు లోబడిన పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు. ఒకరు ఎన్ని ఎంట్రీలనైనా పంపవచ్చు. అయితే, అవి చందమామలో అచ్చయిన ఎంట్రీఫారాలలో మాత్రమే పంపాలి.

2. ఒకరు ఒక్క పోటీలోగానీ, లేదా మొత్తం మూడు పోటీలలోనూ (గొప్ప భారతీయ రాజులు, గొప్ప భారతీయ రాణులు, గొప్ప భారతీయ జంటలు) పాల్గొని బహుమతులు గెలుపొందవచ్చు. ఇవిగాక, బంపర్ ప్రైజులకు కూడా ప్రయత్నించవచ్చు.

3. ఎంట్రీఫారాలను, స్పష్టమైన దస్తూరీలో, చందమామ ప్రచురింపబడుతూన్న పదకొండు భాషలలో ఏ భాషలోనైనా సరే పూర్తిచేసి పంపవచ్చు.

4. పోటీ : 2 ఎంట్రీఫారాలు నవంబర్ 30, 1987 లోగా మాకు చేరాలి.

5. ఎంట్రీలు ఆలస్యంగా అందినా, పోయినా, పాడయినా నిర్వాహకులు బాధ్యత వహించరు.

6. ఎంట్రీలను మామూలు పోస్టు ద్వారా మాత్రమే పంపాలి.

7. చందమామ పబ్లికేషన్స్ ఉద్యోగులూ, హిందూస్థాన్ థాంప్సన్ అసోసియేట్స్ ఉద్యోగులూ, వారి కుటుంబ సభ్యులూ తప్ప తక్కిన భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.

8. ఎంట్రీలను పరిశీలించి, ఎన్నికచేయడంలో న్యాయనిర్ణేతల మండలిదే తుదినిర్ణయం. ఈ విషయంగా ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.

9. విజేతలకు వ్యక్తిగతంగా పోస్టులో తెలియజేయబడు తుంది. వారి పేర్లు చందమామలో ప్రకటించబడతాయి.

**ముఖ్య గమనిక : బంపర్ ప్రైజ్ సెక్షన్**

మీ ఎంట్రీఫారాలు పోస్టుచేసే ముందు, వాటిలో 'చందమామ పోటీ : **2**' అని వున్న లేబిల్‌ను కత్తిరించి మీదగ్గరే భద్రపరుచుకోండి. 1,3 పోటీలకు కూడా అలాగే చేయండి. ఈ మూడు లేబిల్స్‌నూ కలిపి, బంపర్ సెక్షన్ ఎంట్రీఫారం (డిసెంబర్ చందమామ సంచికలో వస్తుంది) మీద అతికించాలి. 3 లేబిల్స్ అతికించబడిన ఎంట్రీ ఫారాలు మాత్రమే బంపర్ ప్రైజు పరిశీలనకు అంగీకరించబడతాయి

ఈ చందమామ కాపీని భద్రపరచండి. బంపర్ సెక్షన్ ప్రశ్నలు సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ సంచికలపై ఆధారపడి ఉంటాయి.

గమనిక : మీరు పోటీ : 1 లో పాల్గొనక పోయి నప్పటికీ, పోటీ : 2 లో పాల్గొనవచ్చు. ఇప్పుడు కూడా సెప్టెంబర్ సంచికలో వున్న పోటీ : 1 లో పాల్గొనడానికి, గడువు దాటిపోలేదన్న విషయం గుర్తుంచుకోండి. (ఆఖరుతేదీ : అక్టోబర్, 31)

# పోటీ : 2

## (ఎంట్రీఫారం)








ఉదాహరణలో చూపిన విధంగా, ఈ అరుగురు రాణుల చిత్రపటాలను, సరైన అంకెలను సూచిస్తూ, సరైన పేర్లతో జతచేయండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ముంతాజ్‌మహల్ | 1 | పద్మినీ | 4 | కుంతి | 7 |
| నూర్జహాన్ | 2 | ఝాన్సీరాణి | 5 | రజీయాసుల్తానా | 8 |
| సీత | 3 | కిత్తూరు చెన్నమ్మ | 6 | గాంధారి | 9 |







ఈ లేబిల్‌ను బంపర్‌ప్రైజు కోసం భద్రపరచండి

బంబర్ ప్రైజుకు (డిసెంబర్ సంచికలో) ప్రయత్నించేప్పుడు, మీరు దీనిని బంపర్ సెక్షన్ ఎంట్రీఫారంమీద అతికించవలసి వుంటుంది.

చందమామ
పోటీ 2

## పోటీ : 2

(ఎంట్రీఫారం)

ఇప్పుడు, పైనవున్న ఆరు చిత్ర పటాల పేర్లలో ఏ ఒక్క రాణి పేరునైనా తీసుకుని, 'ఎందుకంటే'........తరవాత వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

"నేను.................................. రాణి ని ఎంతగానో మెచ్చుకుంటాను

ఎందుకంటే .....................................................................

.........................................................................................

.........................................................................................

మీ పేరు ......................................................................

వయసు............ చిరునామా ..........................................................

.........................................................................................

ఈ పేజీని కత్తిరించి, 'చందమామ పోటీ 2' అని వున్న కూపన్‌ను మీ దగ్గరే ఉంచుకుని, ఎంట్రీఫారాన్ని వెంటనే కింది చిరునామాకు పోస్టు చేయండి :

**చందమామ పోటీ 2**
చందమామ పబ్లికేషన్స్
188, ఆర్కాట్ రోడ్
మద్రాసు-600 026

పోటీ: 2 ఆఖరుతేది: నవంబర్ 30, 1987

ఈ లేబిల్‌ను బంపర్ ప్రైజు కోసం భద్రపరచండి

**మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ**

మనదేశపు అద్భుతాలు :

# అజంతా-ఎల్లోరా

మహారాష్ట్రంలోని ఔరంగాబాద్ జిల్లా కొండలలో 29 గుహలు అపురూపమైన కుడ్యచిత్రాలతో వెలుగొందుతున్నవి. అజంతా గుహలు అని జగత్ప్రసిద్ధి గాంచిన ఇక్కడి కుడ్యచిత్రాలను — బౌద్ధమత ఆదర్శాలతో ఉత్తేజితులైన చిత్రకారులు కొందరు క్రీ॥ పూ॥ రెండు వందల సంవత్సరాలకు పూర్వం చిత్రించడం ప్రారంభించారు.






ఇక్కడి గుహలలోని కుడ్యచిత్రాలూ, బౌద్ధస్తూపాలూ, స్తంభాలూ ఎక్కువ భాగం క్రీ॥ శ॥ ఆరు, ఏడు శతాబ్దాలలో నిర్మించబడ్డాయి.

ఇక్కడి గుహాచిత్రాలూ, శిల్పాలూ కేవలం బౌద్ధమత సిద్ధాంతాలనేకాకుండా, ప్రాచీన సామాజిక జీవన విధానాన్ని సూచించేవిగానూ ఉన్నవి. కొందరు విదేశీవర్తకులు, తమ గుర్రాలను విక్రయించడానికి ఒక భారతీయ రాజుతో సంప్రదింపులు జరపడం—అటువంటి చిత్రాలలో ముఖ్యమైనది.





ఆ కాలంలో స్త్రీలు సంగీతాన్ని అభ్యసించేవారన్న దానికి అధారంగా కొన్ని చిత్రాలు ఇక్కడ ఉన్నాయి. ఒక రాజు సమక్షంలో కొందరు స్త్రీలు సంగీత కచేరి జరపడం—ఏడవ శతాబ్ది రాచరికపు జీవనానికి చక్కటి ఉదాహరణ!


ఔరంగాబాదుకు 30 కి. మీ. దూరంలో ఎల్లోరా గుహాలయాలు వున్నాయి. బౌద్ధ, జైన, హిందూ మతాలకు సంబంధించిన దాదాపు 34 ఆలయాలు ఇక్కడ ఉన్నవి. ఈ ప్రాచీన ఆలయాలలో కొన్ని 4 వ శతాబ్దానికి చెందినవి.
VEERA



ఈ ఆలయాలలో కైలాస ప్రసిద్ధమైనది—అత్యద్భుత శిల్ప కళాఖండాలతో వెలుగొందుతున్న కైలాసనాథ ఆలయం. ఒకే శిలపై నిర్మించబడి వున్న ఈ ఆలయానికి సాటి రాగల ఇటువంటి శిల్ప కళాఖండం ప్రపంచంలోనే లేదని చెబుతారు.

154 అడుగుల వెడల్పూ, 276 అడుగుల పొడవూ గల ఇక్కడి పదహారవ గుహాలయం విశ్వవిఖ్యాతి గాంచినది. శివపార్వతుల లీలావిలాసాలను చిత్రించే ఎన్నో అపురూప శిల్పాలు ఇక్కడ ఉన్నవి.






పదిహేనవ గుహలో అద్భుతమైన వామనావతార శిల్పం వెలుగొందుతున్నది. "ఎల్లోరా గుహలతో పోల్చ తగిన ప్రాచీన కళాఖండాలు ప్రపంచంలో మరెక్కడా కానరావు," అంటాడు బి. సీలీ 'ఎల్లోరా అద్భుతాలు' అనే తన గ్రంథంలో.



# గుండ్రాయి మహిమ

ఒక ముసలిది చనిపోతూ తన ఇద్దరు మనవలనూ పిలిచి, "నాయనలారా, నా దగ్గిర వెండి బంగారాలు లేవు. వంట ఇంట్లో సన్నికల్లూ, గుండ్రాయీ ఉన్నాయి. సన్నికల్లు పెద్దవాడూ, గుండ్రాయి చిన్నవాడూ తీసుకోండి. సుఖంగా కాలం గడపండి," అని చెప్పి ప్రాణాలు వదిలింది.

"సన్నికల్లు నాకెందుకూ? నేనేమన్నా వంటలు చేసుకు బతకాలా?" అనుకుని పెద్దవాడు మరొక గ్రామానికి వెళ్ళి, ఒళ్లు వంచి పని చేసి బాగుపడ్డాడు. చిన్నవాడు మటుకు, "గుండ్రాయివల్ల ఏదో ఉపయోగం లేకపోతే అవ్వ దీన్ని నాకివ్వదు." అనుకుని, అస్తమానమూ దానిని తన వెంటే పెట్టుకు తిరిగాడు. వాడా గుండ్రాయిని వెంట బెట్టుకు తిరగటం చూసి ఊళ్లోవాళ్ళంతా వెటకారం చేసేవాళ్ళు. వాడు రోజూ అడవిలో చితుకులు పోగు చేసి తెచ్చి, ఊళ్ళో వాళ్ళకమ్మి పొట్ట పోసుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు వాడు అడవిలో చితుకు లేరుతూండగా ఒక పెద్ద తోడేలు వాడికేసి వచ్చింది. వాడు బెదిరిపోయి సమీపంలో ఉన్న చెట్టెక్కాడు.

"భయపడకు, నేను నీకేమీ హాని చేసేందుకు యిక్కడికి రాలేదు. నీ దగ్గిర ఉండే గుండ్రాయి ఒక్కసారి అరువియ్యి, చాలు," అన్నది తోడేలు.

"దానితో నీకేం పని?" అని వాడు తోడేలు నడిగాడు.

"నా జతతోడేలు ఇంతకుముందే చచ్చిపోయింది. నీ గుండ్రాయి ఒక్కసారి దాని ముక్కుల దగ్గిర పెడితే అది మళ్ళీ బతుకుతుంది," అన్నది తోడేలు.

"నా గుండ్రాయికి అంత మహత్తున్నదా?" అన్నాడు వాడు.

బర్మా జానపద కథ



"నా వెంట వస్తే నీకే తెలుస్తుందిగా!" అన్నది తోడేలు.

వాడు చెట్టు దిగి తోడేలు వెంట బయలుదేరాడు. అడవిలో ఒకచోట చచ్చిన తోడేలున్నది. ముసలమ్మ మనవడు తన గుంౘాయి తీసి ఆ తోడేలు ముక్కు దగ్గిర పెట్టాడు. వెంటనే దానికి మళ్లీ ప్రాణం వచ్చింది.

"నీ గుంౘాయిమహిమ దాని వాసనలో ఉన్నది. ఈ రహస్యం ఎవరికీ తెలియనంత కాలమూ దానికా మహిమ ఉంటుంది," అని మొదటి తోడేలు వాడికి చెప్పింది.

చిన్నవాడు తన గుంౘాయితో సహా గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఒక కుక్క కళేబరం కనిపించింది. వాడు తన గుంౘాయి తీసి చచ్చిన కుక్క ముక్కుల దగ్గిర ఉంచాడు.

కుక్క వెంటనే లేచి నిలబడి తోక ఆడిస్తూ చిన్నవాడి వెంట బయలుదేరింది.

త్వరలోనే చిన్నవాడి ఖ్యాతి గ్రామమంతా పాకింది. వాడు ప్రాణాలు కూడా పోయగల ఘనవైద్యుడయాడు. అయితే ప్రాణాలిచ్చే శక్తి ఉన్నది వాడి గుంౘాయిలో నన్న విషయం ఎవరికీ తెలియదు.

కొంతకాలానికి రాజుగారి ఏకైక సంతానమైన కూతురు కాస్తా చనిపోయింది. చిన్నవాడు వెళ్ళి ఆమెను మళ్లీ బతికించాడు. రాజుగారు కృతజ్ఞతతో తన కుమార్తెను వాడికిచ్చి పెళ్ళి చేసి రాజ్యానికి వాణ్ణి వారసుణ్ణి చేశాడు. రాజుగారి అల్లుడై కూడా చిన్నవాడు చచ్చిపోయిన వారికి ప్రాణదానం చెయ్యటం మానలేదు. అందుచేత ఆ రాజ్యంలో ఎవరికీ చావు భయం అన్నది లేకుండా పోయింది.

ఒక రోజు చిన్నవాడి కొక ఆలోచన వచ్చింది: తన గుంౘాయి వాసనతో పోయిన ప్రాణాలు రాగా లేందీ, వార్ధక్యం రాకుండా ఎందుకుండదు? ఇది నిజమో కాదో తేల్చుకుందామని వాడు రోజూ గుంౘాయిని తాను వాసన చూస్తూ తన భార్యను కూడా వాసన చూడమన్నాడు.

గుండ్రాయి వాసన చూడటం రాజకుమార్తెకు అర్థం లేని పనిగా తోచింది. అయినా తన భర్త ఘనవైద్యుడు గనక, ఏదో ఉద్దేశంతో అలా చెప్పి ఉంటాడను కుని తాను కూడా రోజూ గుండ్రాయిని వాసన చూస్తూ వచ్చింది. దీని ఫలితంగా, చిన్నవాడూ, వాడి భార్యా నిత్యయౌవనులుగా ఉండిపోయారు.

వారిని చూసి చంద్రుడు అసూయ పడ్డాడు. నిత్యయౌవన మనేది తనకు తప్ప మరెవరికీ ఉండరాదని చంద్రుడి ఉద్దేశం. అందుచేత చంద్రుడు చిన్నవాడి గుండ్రాయిని కాజెయ్యటానికి అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాడు చిన్నవాడు తన గుండ్రాయి కేసి చూసేసరికి అది పాచి పట్టి, వెలవెల పోతూ ఉండటం కనిపించింది. పాచి పోగొట్టటానికి వాడు దాన్ని ఎండలో ఉంచి, తానే కాపలా కూచున్నాడు.

ఇది చూసి రాజకుమార్తె, "కాబోయే రాజువుగదా, ఇదేం పని? గుండ్రాయికి నీవే కాపలా కాయాలా? ఎంతమంది భటులు లేరు?" అన్నది.

"నేను నా కుక్కను తప్ప ఇంకెవరినీ నమ్మలేను," అంటూ వాడు తన కుక్కను గుండ్రాయికి కాపలా పెట్టి తాను లోపలికి వెళ్ళిపోయాడు.

ఇదే సమయమనుకుని చంద్రుడు ఆ గుండ్రాయి ఉన్న చోటికి దిగి వచ్చి, గుండ్రాయి ఎత్తుకుని పారిపోసాగాడు. అమావాస్య చంద్రుడు కావటంచేత కుక్క అతణ్ణి చూడలేకపోయింది. అయితే గుండ్రాయి వాసన దానికి తెలుసు గనక ఆ వాసనను బట్టి తరుముకు వెళ్ళింది.

ఆ కుక్క ఇంకా చంద్రుణ్ణి తరుముతూనే ఉందంటారు బర్మావాళ్ళు. చంద్రగ్రహణం కలిగినప్పుడు, "అదుగో చంద్రుణ్ణి కుక్క మింగింది," అంటారు. గ్రహణం విడవగానే, "కుక్క చంద్రుణ్ణి కక్కింది," అంటారు. కుక్క చాలా చిన్నది కావటం చేత చంద్రుడు దానికి మింగుడు పడడని వారి అభిప్రాయం!



# తిప్పడి తెలివి

స్రవంతిపురరాజు నాగవర్మ, తన కోరమీసాలకు రకరకాల అత్తర్లు పూస్తూ, కన్నబిడ్డల కన్న అపురూపంగా పెంచుకుంటున్నాడు. ఒకనాడు, ఆయనకు గడ్డం చేస్తున్న తిప్పడు, మాటల్లో పడి, ఒక పక్క మీసాన్ని కొంత గీసి పారేశాడు.

జరిగిన పొరబాటు గమనించిన తిప్పడు, రెండు, మూడు క్షణాల్లో రాజు సంగతి తెలుసుకుని, తనకు ఉరిశిక్ష విధిస్తాడని గడగడలాడాడు. అయితే, ఆ సమయంలో, వాడి కొక తెలివైన ఆలోచన వచ్చింది.

వాడు, రాజుతో, "ప్రభూ, రాజు కాదు, చక్రవర్తి అయినాసరే, ఏదైనా బలహీనతకు లోనైతే, దాన్నుంచి ఒక పట్టాన బయటపడలేడు," అన్నాడు.

తిప్పడి మాటలకు పౌరుషం తెచ్చుకుని, రాజు, "నేనెటువంటి బలహీనత నుంచయినా, యిట్టే తప్పించుకోగలను," అన్నాడు.

"అది, అంత తేలికయిన పనేం కాదు, ప్రభూ! మీకు తరచుగా మీసాలు దువ్వుకునే అలవాటున్నది. ఒకవేళ అవి లేకపోయినా, బుగ్గ మీద చేయి వేస్తారు," అన్నాడు తిప్పడు సవాలు చేస్తున్నట్టు.

రాజు అహం దెబ్బతిన్నది. "నేను, నీ వనేది ఒప్పుకోను. కావాలంటే, నా మీసాలు తీసెయ్యి," అన్నాడాయన.

బతుకు జీవుడా అనుకుని తిప్పడు, రాజు మీసాలు గొరిగివేశాడు.

ఒకటి, రెండు క్షణాలు గడిచేసరికి, తిప్పడన్నట్టు, రాజు మీసాలు దువ్వబోయి, ఫక్కున నవ్వేశాడు.

తర్వాత ఆయన, తిప్పడన్నది అక్షరసత్యం అని ఒప్పుకుని, వాడికి మెడలోని హారం బహూకరించాడు.

—బూర్లె నరసింహశాస్త్రి





# కృష్ణావతారం

మేరుపర్వతం మీద జరిగిన దేవసభ నుంచి బయలుదేరిన నారదుడు తిన్నగా మధురానగరానికి వెళ్ళాడు. ఆయన కంసుడి మందిర ద్వారాన్ని చేరేసరికి, ప్రతీహారులు వచ్చి ఆయనను లోపలికి తీసుకు వెళ్ళారు. నారదుడికి కంసు డెదురు వచ్చి, ఎంతో వినయంతో అర్ఘ్య పాద్యాదులిచ్చి, పూజించి, చాలా తృప్తి కలిగించాడు.

అప్పుడు నారదుడు కంసుడి కేసి చూస్తూ, అందరూ వింటూ ఉండగా, "నాయనా, నేను తీర్థయాత్రలు చేసు కుంటూ, అలా మేరుపర్వతం కేసి వెళ్లాను. అక్కడ బ్రహ్మ మొదలైన దేవతలంతా పెద్ద సభ చేసి ఉన్నారు. ఏదో పెద్ద చర్చ జరుగుతున్నదని గ్రహించి నే నక్కడ కాస్సేపు నిలిచాను. ఏం చెప్పమన్నావు? వాళ్ళందరూ చేరి, నిన్ను చంపడానికి రహస్యంగా పెద్ద పథకం ఆలోచిస్తున్నారు. మీ పెత్తండ్రి కూతురు దేవకీదేవి ఉంది, చూశావూ? ఆవిడకు కలిగే ఎనిమిదో బిడ్డ నీకు మృత్యువు కలిగిస్తుందట. దేవతల కందరికీ రక్షకుడైనవాడే అందుకుగాను అవతార మెత్తుతున్నాడట! కనక, నాయనా, నీ ప్రాణానికి హాని కలగకుండా జాగ్రత్తపడి తగిన ఏర్పాటులు చేసుకో. ధర్మమార్గం తప్పకుండా సుఖంగా జీవించు. నీ మేలు కోరినవాణ్ణి గనక ఈ ముక్క కాస్త నీ చెవిని వేసి పోదా మని ఇలా వచ్చాను," అని అప్పటి

## 2. కృష్ణజననము



కప్పుడే బయలుదేరి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

తరవాత కంసుడు తన భృత్యులను చూసి చిన్న నవ్వు నవ్వి, "తెలివి గల వాడని, ఈ నారదుడంటే చాలా స్నేహ భావంతో ఉంటూ వచ్చాను. కాని నా బోటి సత్వవంతుణ్ణి ఇలా భయపెడతాడా? నేను బ్రహ్మను గాని, మరే దేవతలను గాని లక్ష్యపెడతానా? నాకే కోపం వచ్చిందంటే ఒక్క పిడికిటి పోటుతో దిక్కులనూ, దిక్పాలకులనూ అణగార్చగలను! కొండలన్నీ అవిసినా, సముద్రాలన్నీ ఇంకినా సరే నేను మాత్రం చలించేవాణ్ణి కాను! అది అలా ఉంచండి. ఈ నారదుడికి కాలూ, నోరూ క్షణం ఊరుకోవు. ప్రతి చోటికి పోతూ, నోటికి వచ్చినదెల్లా అంటూ, ఒకరి మీదికి ఒకరిని రెచ్చగొట్టి, తంపులు పెట్టి తమాషా చూస్తాడు. అయన ఎలాటివాడైతే మనకేం? యదుకులం నుంచి అపాయం ఉందని అయన అంటున్నాడు గనక, మన అరిష్ట కేశి ప్రలంబ దేనుక పూతన కాళీయు లాదిగా గల వాళ్ళందరూ చాలా జాగరూకులై ఉండి, నా శత్రువులను సమూలంగా నాశనం చెయ్యాలి. తల్లిగర్భాన ఉన్న వాళ్ళను సైతం వదిలిపెట్టరాదు. నే నుండగా నా భృత్యులెవరూ దేనికి భయపడవలసిన పని లేదు. అండగా నేనున్నాను గనక అందరూ స్వేచ్ఛగా సంచరించవచ్చు." అన్నాడు.

తరవాత కంసుడు సభ చాలించి తన భవనానికి వెళ్ళి, మరుక్షణమే తన ఆప్తులను రహస్యంగా ఒకచోట సమావేశపరచి, "ఇవాళ నుంచి మన దేవకీదేవికి అనేకమంది పరిచారికలను ఏర్పాటు చేసి, కాపలా ఉంచండి. వాళ్ళు వసుదేవుణ్ణి కూడా ఒక కంట కనిపెట్టి ఉండాలి. దేవకికి ఎప్పుడు గర్భధారణ జరిగినదీ, ఏయే నెలలు జరిగేదీ, ఎప్పుడు పురుడు వచ్చేదీ నాకు ఎప్పటికప్పుడు తెలియజేస్తూ ఉండాలి. వినుగూ, విరా



కాలనేమి కొడుకులు ఆరుగురుండేవారు. వారు చావులేకుండా బ్రహ్మ నుంచి వరాలు పొందాలని తపస్సు ప్రారంభించారు. ఆ సమయంలో మూడు లోకాలకూ తానే అధిపత్యం వహించి ఉన్న హిరణ్యకశిపుడు, ఈ సంగతి తెలిసి, "కులశ్రేష్ఠుణ్ణి నేనుండగా మరొకరి నుంచి వరాలు ఆశిస్తారా? మిమ్మల్ని కని పెంచిన తండ్రి చేతనే చావండి," అని శపించాడు అమితమైన కోపావేశంతో.

ఈ సంగతి స్మరణకు రాగానే విష్ణువు యోగమాయను పిలిచి, "నీవల్ల ఒక పని కావలసి ఉన్నది. షడ్గర్భులనెవాళ్ళు, కాలనేమి కొడుకులు ఆరుగురున్నారు. వాళ్ళను ఒక్కొక్కణ్ణీ తీసుకుపోయి దేవకి గర్భంలో ప్రవేశపెట్టు. వాళ్ళు పుట్టిన వెంటనే కంసుడు చంపేస్తాడు. దేవకికి కలిగే ఏడవ గర్భాన్ని రోహిణికి మార్చు. దేవకికి ఏడవసారి కంసుడి భయంచేత గర్భస్రావమయిందని అందరూ అనుకుంటారు. ఆ బిడ్డ నాకు అన్నగా రోహిణి గర్భాన జనిస్తాడు. తరవాత దేవకీదేవి అష్టమగర్భంలో నేను ప్రవేశించేటప్పుడే, నువు కంసుడి గోవులకు పాలకుడైన నందుడి భార్య యశోద గర్భంలో ప్రవేశించు. మనమిద్దరమూ అర్ధరాత్రివేళ జననం పొంది స్థానాలు మారుదాం. అటు మమూ లేకుండా అహోరాత్రులు కాపలా సాగాలి. దీనికంతకూ కారణమేమిటో ఎవ్వరికీ తెలియకూడదు," అని వారిని హెచ్చరించాడు.

ఈ లోపల నారదుడు మధురానగరం నుంచి విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి తాను ఏ విధంగా కంసుడి మనసులో విషబీజం నాటినదీ, దాని ఫలితంగా కంసుడు తలపెట్టిన నీచకార్యాలూ తెలిపాడు.

నారదుడు వెళ్ళాక విష్ణుమూర్తి, కంసుడి జాగ్రత్తలన్నీ తప్పించుకుని తాను అవతరించే ఉపాయాలాలోచించసాగాడు. ఆయనకు ఒక పాత వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే—పాతాళంలో

తరవాత కంసుడు నిన్ను రాతి కేసి కొట్టి చంపయత్నించినప్పుడు ఆకాశానికి ఎగిరిపో. అటు తరవాత ఇంద్రుడు నీ కెదురువచ్చి, తీసుకుపోయి, నిన్ను ఆది శక్తిగా అభిషేకిస్తాడు. నీలమేఘచ్ఛాయా, నిండు చంద్రుడులాంటి ముఖమూ, ఎనిమిది చేతులలో శార్ఙ్గమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ, పద్మమూ, మధుకలశమూ, ముసలమూ, శూలమూ ధరించి, దివ్యాభరణ భూషితవై, నీలం రంగు గల పట్టుచీర ధరించి, సమస్త దేవతలచేతా భక్తిశ్రద్ధలతో పూజింపబడతావు." అన్నాడు.

యోగమాయ సరేనన్నది. ఆమె మహిమచేత దేవకీదేవి షడ్గర్భులను, ఒకరి తరవాత ఒకరుగా, తన గర్భాన ధరిస్తూ వచ్చింది. ఆమెకు ప్రసవకాలం సమీపించినప్పుడల్లా కంసుడి మనుషులు వెళ్ళి కంసుడితో ఆ సంగతి చెప్పేవాళ్ళు. కంసుడు వచ్చి, పుట్టిన బిడ్డను పుట్టినట్టే తీసుకుపోయి, దాని కాళ్ళు పట్టుకుని రాతి మీద కొట్టి చంపేసేవాడు.

దేవకీదేవి ఏడవసారి గర్భిణిగా ఉండగా యోగమాయ ఆ గర్భాన్ని తీసుకుపోయి, గోకులంలో ఉన్న రోహిణి గర్భాన ప్రవేశపెట్టింది. రోహిణికి నెలలు నిండి, పూర్ణచంద్రుడితో సమానమైన పుత్రుడు కలిగాడు. గర్భసంకర్షణం చేత పుట్టిన కారణాన ఇతను సంకర్షణుడయాడు. ఇతనే బలరాముడు.





బలరాముడు పుట్టిన అనంతరం దేవకి ఎనిమిదోసారి గర్భం ధరించింది. అందులో విష్ణుమూర్తి అంశ ప్రవేశించింది. ఆనాడే గోకులంలో నందుడి భార్య యశోద కూడా గర్భం దాల్చింది.

తొమ్మిది మాసాలు గడిచి, పదో మాసం ప్రవేశించింది. శ్రావణమాసంలో, కృష్ణ పక్షంలో, అష్టమినాటి అర్ధరాత్రి, అయిదు గ్రహాలు ఉచ్చలో ఉండగా విష్ణువు అంశన కృష్ణుడు దేవకీ గర్భాన జననం పొందాడు. ఆ క్షణంలో దేవకీ, వసుదేవుడూ తప్ప ఇతరు లెవరూ మేలుకుని లేరు. కావలివాళ్ళు గాఢనిద్రలో మునిగి శవాల లాగా పడి ఉన్నారు.

తనకు కొడుకు కలిగాడన్న భావం ఎలాగో మనస్సులో కలిగి వసుదేవుడు దేవకి ఉన్నచోటికి ఆ అపరాత్రివేళ గబ గబా వచ్చాడు. అక్కడ చంద్రోదయమై నట్టుగా ఉన్నది. పుట్టిన బిడ్డ, దట్టమైన వెంట్రుకలూ మేఘవర్ణమూ కలిగి, ఒంటికి ఎక్కడా ఒక్క మరకగాని, మాలిన్యం లేకుండా, విశాలమైన కళ్ళు విచ్చి చుట్టూరా పరికించి చూస్తూ అద్భుతంగా కనిపించాడు.

"దుర్మార్గుడైన కంసుడు ఈ శిశువుకు కూడా హాని చేస్తే ఎలా చూడగలను? ఇప్పుడే వీణ్ణి తీసుకుపోయి ఎక్కడైనా భద్రంగా దాస్తాను," అనుకున్నాడు వసు దేవుడు తన మనస్సులో.

దేవకి ఆ బిడ్డను ప్రసవవేదన లేకుండా కన్నది. అయితే ఇక చేయవలసిందేమిటో ఆమెకు తోచలేదు. వసుదేవుడు తనకు కలిగిన ఆలోచన దేవకికి చెప్పి, ఆమె తొడ మీద ఉన్న బిడ్డను తన చేతులలోకి తీసుకుని, చప్పున అంతఃపురం దాటి వచ్చి, తిన్నగా నందుడి ఇంటికి వెళ్ళాడు. అక్కడ యశోద అంతకుముందే ఆడ పిల్లను కని ఒళ్ళు తెలియని నిద్రలో ఉన్నది. వసుదేవు డామె పక్కన తన కొడుకును మెల్లగా పడుకోబెట్టి, ఆమె కన్న ఆడపిల్లను ఎత్తుకుని వేగంగా తన

ఇంటికి తిరిగివచ్చి, ఆ బిడ్డను దేవకి పక్కలో పడుకోబెట్టి, వెంటనే కంసుడి వద్దకు వెళ్ళి, దేవకి బిడ్డను కన్నదని చెప్పాడు.

కంసుడు కంగారుగా నిద్రలేచి, జుట్టు ముడీ, బట్ట కుచ్చెళ్ళూ ఊడుతూ, గబగబా వచ్చి, పురిటి గది వాకిట నిలబడి, "బిడ్డనిలాతే, తే!" అని గట్టిగా కేకలు పెట్టాడు.

దేవకి ఆ బిడ్డను తన రొమ్ముకు అదుముకుంటూ, "అన్నా, అగ్రహించకు. ఈసారి నేను కన్నది ఆడపిల్ల. నీలాటి లోకైకవీరుణ్ణి అబల అయిన ఈ ఆడబిడ్డ ఏం చెయ్యగలదు? కరుణించి దీన్ని రక్షించు. ఇంతకు ముందు పుట్టిన వాళ్ళంతా మగవాళ్ళు కావటం చేత, వాళ్ళవల్ల నీకేం కీడు కలుగుతుందో అని నిన్ను నేను వారించలేదు. ఈసారి నా పైన దయ ఉంచు," అని దీనాతిదీనంగా వేడుకున్నది.

కంసుడు ఆ మాటలేవీ వినిపించుకోకుండా పురిటింట జొరబడుతుంటే కావలి ఉండే స్త్రీలందరూ హాహాకారాలు చేశారు. అతను బలాత్కారంగా దేవకి చేతుల నుంచి బిడ్డను లాగేసి, ఎప్పటిలాగే రాతి కేసి కొట్టి చంపటానికై పైకెత్తాడు. పైకెత్తిన ఆ బిడ్డ కంసుడి చేతిలో నుంచి జారి,



పైకెగిరి, ఆదిశక్తి రూపం ధరించి ఆకాశాన నిలిచి, పానకలశం నుంచి మధువు తాగి, అట్టహాసంగా నవ్వుతూ, కంసుణ్ణి చూసి, "ఓరీ దుర్మార్గుడా! నన్నిలా రాతి కేసి కొట్టి చంపాలని చూసినందుకు, నిన్ను నీ ఘోరశత్రువు చంపినప్పుడు నేను మృత్యుదేవత రూపంలో వచ్చి, నీ ప్రాణాలూ, నెత్తురూ అపహరిస్తాను. ఇంకెందుకు మిడిసి పడతావు? నిన్ను చంపేవాడు పుట్టనే పుట్టాడు," అంటూ అదృశ్యమయిపోయింది.

వెంటనే కంసుడు దేవకీదేవి వద్దకు వచ్చి, చేతులు జోడించి, "అమ్మాయీ, ప్రాణభయంతో నేను మహాపాపం చేశాను.

నీ బిడ్డలందరినీ చంపి, నీకు గర్భశోకం కలిగించాను. ఇంతకూ నా ప్రయత్నం నెరవేరనేలేదు. తుచ్ఛమైన మనుష్య యత్నంతో బ్రహ్మలిఖితాన్ని మార్చటం సాధ్యమా? మనం నిమిత్త మాత్రులమే గాని, అసలు చంపేదీ, పోషించేదీ కాల పురుషుడు. అందుచేత నీ దుఃఖాన్ని విడిచిపెట్టు, నీ కాళ్ళూ, చేతులూ పట్టుకుని వేడుకుంటున్నాను," అన్నాడు చాలా దీనంగా.

దేవకీదేవి ఏడుస్తూ, "నాకీ శోకం రాసిపెట్టి ఉండగా నువు మాత్రం ఏం చెయ్యగలవులే, అన్నా!" అని కంసుణ్ణి ఓదార్చి పంపేసింది.

తెల్లవారకుండానే వసుదేవుడు నందగోపుడి ఇంటికి వెళ్ళాడు. నందుడు కొడుకు పుట్టిన సంబరంలో ఉన్నాడు. అతన్ని చూసి వసుదేవుడు, "ఆహా, ఎంత చక్కని కొడుకును కన్నావయ్యా! అదృష్టవంతుడివి. నీ కొడుకుతో సహా మీ స్వస్థానమైన గోకులానికి వెళ్ళు. అక్కడ నా భార్య రోహిణికి పుట్టినవాడున్నాడు. వాణ్ణి నీ పెద్దకొడుకుగానూ, వీణ్ణి నీ రెండో కొడుకుగానూ చూసుకుంటూ పెంచు. ఆ అడవి ప్రాంతంలో వీళ్ళను జాగ్రత్తగా, ఏమరపాటు లేకుండా పెంచుసుమా. పాపిష్ఠివాడు కంసుడు దేవకి కన్న పిల్లలందర్నీ పొట్టన పెట్టుకున్నాడు. రోహిణి కన్న ఆ నలుసే దక్కింది. వాణ్ణి పెంచే భారం నీదే. కంసుడు పిల్లల్ని చంపమని నియోగించిన పూతనకు పసిపిల్లలకోసం వెతకటమే పని. తెల్లవారకముందే బయలుదేరి వెళ్ళి మందను చేరు. నువ్వీ నగరానికి కప్పం కట్టడానికి గదా వచ్చావు? ఆ పని కూడా అప్పుడే తీరిపోయింది గనక మరి ఆలస్యం చెయ్యకుండా ప్రయాణంకా," అన్నాడు.

వసుదేవుడిలా అనగానే నందుడు పురిటి పాపణ్ణి తొట్టెలో పెట్టి మోయించుతూ, తన భార్యతో సహా, పొట్టి ఎద్దులు కట్టిన బండి మీద ఎక్కి వేగంగా మందలుండే చోటికి చేరుకున్నాడు.





# అపాత్రదానం

శ్రావంతరాజైన సుకేతుడు, ఒకనాడు వేటకై కొండగుట్టలుండే అరణ్య ప్రాంతానికి వెళ్ళి, పరివారం నుంచి వేరై తిరగసాగాడు. అప్పుడాయనకు, ఒకచోట గాఢనిద్రలో వున్న గొర్రెలకాపరి యువకుడూ, అతణ్ణి చిత్రిస్తున్న చిత్రకారుడూ కనిపించారు.

యువకుడు, ఒక చెట్టు నీడలో రాతి బండ మీద ప్రశాంతంగా నిద్రిస్తున్నాడు. రాజు మెల్లిగా చిత్రకారుడి దగ్గిరకు వెళ్ళి, ఎంతో అమాయకంగా కనిపిస్తున్న, ఆ యువకుడిని, జీవకళ ఉట్టిపడేటట్టు చిత్రించిన చిత్రకారుణ్ణి ఎంతగానో అభినందించాడు.

చిత్రకారుడు, వచ్చినది రాజని గుర్తించి, ''మహారాజా, నా పేరు అనంతుడు. చిరుతపులులూ, ఎలుగుబంట్లూ తిరిగే, యీ ప్రాంతానికి గొర్రెలను మేపేందుకు వచ్చి, వాటి కాపలా, తన రక్షణా కూడా మరిచి, యీ యువకుడు ఎంత ప్రశాంతంగా నిద్రపోతున్నాడో చూడండి!'' అన్నాడు.

సుకేతుడు, యువకుడి కేసీ, అతడి చిత్తరువుకేసీ ఒకమారు చూసి, తన మెడలోని హారాల్లో ఒకదాన్ని చిత్రకారుడికి యిస్తూ, ''ఈ చిత్తరువు నేను తీసుకుంటాను. ప్రతి ఫలంగా దీన్ని తీసుకోండి,'' అన్నాడు.

చిత్రకారుడు, నిద్రపోతున్న గొర్రెల కాపరి యువకుణ్ణి నిద్రలేపి, హారాన్ని అతడికిస్తూ, ''మహారాజా, నేను చిత్రకళలో కొంత ప్రావీణ్యం వున్నవాడినే కావచ్చు. కాని, మీరు మెచ్చేపాటి ఉత్తమ చిత్రాన్ని నేను చిత్రించానంటే, అందుకు మూలకారణం, యీ యువకుడు. ఏదో ఒక సుందర దృశ్యాన్ని చిత్రించాలని

ఎం. డి. సౌజన్య

యీ ప్రాంతానికి వచ్చిన నాకు, పట్టపగలు అరణ్య మధ్యంలో యింత నిశ్చింతగా నిద్రపోగలిగేవాడు, చాలా మంచివాడని పించి చిత్రించాను. అందువల్ల, మీరిచ్చిన పారితోషికం, యితడి కివ్వడం ధర్మం!'' అన్నాడు.

అప్పుడు సుకేతుడు, తన వేలి వజ్రాల ఉంగరాన్ని చిత్రకారుడికి యిచ్చి, "మీరు మరొక మంచి చిత్రాన్ని చిత్రించి, నాకు యిచ్చేవరకూ, ఆ విషయాన్ని యీ ఉంగరం మీకు గుర్తు చేస్తూ వుంటుంది,'' అన్నాడు.

ఆ తర్వాత, పరివారం రాజును వెతుక్కుంటూ అక్కడికి రావడంతో, సుకేతుడు నగరానికి తిరిగి వచ్చాడు.

ఇది జరిగిన పాతికేళ్ళకు, అనంతుడు, రాజు సుకేతుడి ఆస్థానానికి రావడం జరిగింది.

ఆ సమయంలో రాజు, గొలుసులతో బంధింపబడి వున్న, ఒక బందిపోటు దొంగకు మరణదండన విధించి, దాన్ని మరసటి రోజు అమలుపరచవలసిందిగా భటులకు ఆజ్ఞయిస్తున్నాడు.

అనంతుడు, ఆ బందిపోటు కేసి పరీక్షగా చూస్తున్నంతలో, రాజు అతణ్ణి గుర్తించి, "చిత్రకారులకు ఆహ్వానం! మరేదైనా మంచి సజీవచిత్రాన్ని చిత్రించి తీసుకువచ్చారా?'' అని అడిగాడు.

అనంతుడు, భటులు కారాగారానికి తీసుకుపోతున్న బందిపోటు దొంగను



రాజుకు చూపుతూ, "మహారాజా, కాఠిన్యం, పశుత్వం మనిషిలో ఎంత ఉన్నతస్థాయికి చేరగలదో చెప్పడానికి, ఆ దొంగ ముఖంలోని క్రౌర్యమే మంచి ఉదాహరణ. అతడి చిత్రాన్ని సజీవంగా చిత్రిస్తాను. అనుమతించండి," అన్నాడు.

అందుకు రాజు అంగీకరించాడు.

అనంతుడు బందిపోటు దొంగ వున్న కారాగారానికి వెళ్ళాడు. దొంగ అతణ్ణి చూస్తూనే కనుబొమలు చిట్లించి, తల పక్కకు తిప్పుకున్నాడు.

అనంతుడు తను వచ్చిన పని వాడికి చెప్పాడు. దొంగ మారుమాట్లాడకుండా, అనంతుడు కోరిన విధంగా కొంతసేపు కదలకుండా కూర్చుని, అతడికి సహకరించాడు. ఆ కారణంవల్ల, చిత్రం త్వరలోనే పూర్తయింది.

అనంతుడు యిందుకు చాలా సంతోషించి, బందిపోటు దొంగకు పాతికేళ్ళ క్రితం రాజు తన కిచ్చిన వజ్రాల ఉంగరాన్ని యివ్వబోయాడు.

అయితే, దొంగ దాన్ని తిరస్కరిస్తూ, "అయ్యా, నేనెవరైనదీ, తమరు గుర్తించలేదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు అనంతుడు ఆశ్చర్యపోయి, గుర్తించలేదన్నట్టు తల వూపాడు.

బందిపోటు దొంగ వికవికమంటూ నవ్వి, "నన్ను తమరూ గుర్తించలేదు, రాజుగారూ గుర్తించలేదు. ఇది నా దురదృష్టం!" అన్నాడు.





కారాగారం నుంచి బందిపోటు దొంగను తన దగ్గరకు తీసుకురావలసిందిగా, భటులను ఆజ్ఞాపించాడు.

భటులు, దొంగను రాజు దగ్గిరకు తెచ్చారు. దొంగ, అనంతుణ్ణి రాజుకు చూపుతూ, "మహారాజా, ఇప్పటి నా దుర వస్థకు మూలకారణం, యీ చిత్రకారుడు. అది చాలక మరొకసారి నాలో ధనాశ రగుల్కొల్పాలని ప్రయత్నించాడు. తమ రాయనకు బహూకరించిన వజ్రాల ఉంగరాన్ని, నాకు పారితోషికంగా యివ్వ జూపాడు," అన్నాడు.

ఈ మాటలకు సుకేతుడు ఆశ్చర్య పోయి, "చిత్రకారుడికి నేను ఉంగరం బహుమతిగా యిచ్చిన సంగతి, నీకెలా తెలుసు?" అని ప్రశ్నించాడు.

దొంగ ఒకక్షణం చిరునవ్వునవ్వుతూ వూరుకుని, "మహారాజా, యిప్పటికి పాతికేళ్ళక్రితం, నేను కల్లాకపటం తెలి యని గొర్రెలకాపరిని. ఒక మిట్టమధ్యాహ్న సమయంలో, అరణ్యంలోని ఒక చెట్టు కింద సుఖనిద్ర పోతూండగా, యీ చిత్ర కారుడు నన్ను అతి సహజంగా చిత్రిం చాడు. అందుకు మెచ్చుకుని, మీరాయ నకు మెడలోని హారం బహూకరించారు. ఆ హారమే యిప్పుడు, నాకు ఉరితాడు కాబోతున్నది," అని చెప్పాడు.

అనంతుడికి వాడి మాటలేమీ అర్థం కాక, "రాజుగారు, నీకు మరణదండన విధించే సమయంలో, నేను అక్కడే వున్నాను. అప్పుడైనా నువ్వు, ఆయనకు నువ్వెవరైనదీ ఎందుకు చెప్పలేదు?" అని అడిగాడు.

"సమయం మించిపోయిందను కున్నాను. ఇప్పుడు తమరు, నన్ను రాజు గారి సమక్షానికి తీసుకుపోగలరా?" అన్నాడు బందిపోటు.

వాడి మాటల వెనక ఏదో గొప్ప రహస్యం వున్నదని భావించిన అనంతుడు, అప్పటికప్పుడే వెళ్ళి, సుకేతుడికి జరిగినది చెప్పాడు. ఆయనకు కుతూహలం కలిగి,

ఇది విన్న సుకేతుడికీ, అనంతుడికీ, యీ గజదొంగ, అలనాటి అమాయక గొర్రెల కాపరి యువకుడని తెలిసిపోయింది. అయితే, ఏ కారణంవల్ల, వాడు బందిపోటు దొంగ అయ్యాడు ?

సుకేతుడు ప్రశ్నించగా, దొంగ యిలా చెప్పాడు : "మహారాజా, మీరు చిత్ర కారుడి కిచ్చిన హారాన్ని, ఆయన నాకు యివ్వడం జరిగింది. దాన్ని తిమ్మాపురం అనే చిన్నపట్టణంలో, ఒక నగల వర్త కుడికి అమ్మజూపాను. నా వేషభాషలు గమనించిన అతడు, నన్ను దొంగ అని కొత్వాలుకు అప్పగించాడు. కొత్వాలు నేను చెప్పినదంతా కట్టుకథ కింద జమ కట్టి, ఖైదులో పెట్టాడు. అక్కడి దొంగల తోటి, నా పరిచయం క్రమంగా స్నేహంగా మారింది. దానితో నేను శాశ్వతంగా బంది పోటుగా, హంతకుడుగా మారాను !"

బందిపోటు చెప్పినదంతా శ్రద్ధగా విన్న రాజు, నివ్వెరపోయాడు. అరణ్యప్రాంతాల గొర్రెలను మేపుకుంటూ, ఏ చీకూచింతా లేకుండా కాలం వెళ్ళబుచ్చుతున్న యువకుడు, విలువైన హారం కారణంగా బందిపోటు దొంగ అయ్యాడు !

సుకేతుడు యిలా ఆలోచించి, బంధి పోటును, "నువ్వు చేసిన ఘోరకార్యాల కేమైనా పశ్చాత్తాపపడుతున్నావా ?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు బందిపోటు తల వంచు కుని,"పశ్చాత్తాపపడుతున్నాను, మహారాజా! కాని, రేపు చావనున్న నాకు, అందువల్ల ప్రయోజనమేమున్నది." అన్నాడు.

రాజు వెంటనే, "నీకు, మా పశుల కాపరులపై పర్యవేక్షకుడి ఉద్యోగం యిస్తున్నాను, యిక వెళ్ళు." అని, చిత్ర కారుడికి, తన మెడలోని హారాల్లో, ఎక్కువ విలువైన హారాన్ని యిస్తూ, "విజ్ఞులు అపాత్రదానం హానికరమని వూరకే అన లేదు. నేనిస్తున్న, ఈ హారాన్ని కూడా, మరే అపాత్రుడికో దానం చేసి, వాణ్ణి చిక్కులపాలు చేయకండి !" అని సలహా యిచ్చాడు.





# ఇద్దరు బ్రహ్మరాక్షసులు

ఒక గ్రామంలో, కష్టపడి వ్యవసాయం చేసుకునే రైతు దంపతులకు, లేక లేక జన్మించాడు, సులోచనుడు. చిన్నతనం నుంచీ వాడు, వ్యవసాయమంటే ఆసక్తి చూపక, చదువే, చదువే అని మారాం చేస్తూంటే—తండ్రి వాడిని గ్రామంలోని ఒక పండితుడి వద్దకు పంపించాడు.

అయిదు సంవత్సరాలు గడిచేసరికి, సులోచనుడు, పండితుడికి తెలిసినదంతా, తానూ తెలుసుకుని, కవిత్వం చెప్ప నారంభించాడు.

ఒకనాడు పండితుడు, సులోచనుడి తల్లిదండ్రులతో, "మీవాడు గొప్పకవి అవుతాడు. కాని, కవిత్వానికి మన గ్రామంలో ఆదరణలేదు. మన దేశపు రాజుకు కూడా కవిత్వమంటే పెద్దగా ఆసక్తిలేదు. అందువల్ల, మీవాడికి నెమ్మదిగా వ్యవసాయప్పనులు నేర్పండి," అని సలహాగా చెప్పాడు.

రైతు దంపతులు, సులోచనుడికి ఎన్నో విధాల చెప్పి చూశారు. కాని, వాడి దృష్టి వ్యవసాయం మీదికి మళ్ళలేదు.

ఒక్కగానొక్క కొడుకు మనసు కష్టపెట్టలేక రైతు, భార్యతో, "మనం మరింతగా శ్రమపడి, బాగా డబ్బు కూడబెడదాం. ఆ డబ్బుతో మనవాడు, ఏ చీకూచింతా లేకుండా జీవిస్తాడు," అన్నాడు.

ఇందుకు రైతు భార్య సరేనన్నది. అయితే, దురదృష్టవశాత్తూ పొలంలో పాము కాటువేయగా, రైతు అకాల మరణంపాలయ్యాడు. ఆ వార్త వింటూనే, రైతు భార్య గుండె ఆగి మరణించింది.

ఆ తర్వాత, రైతు దాయాదులు, కొంత కాలంపాటు సులోచనుణ్ణి తమ దగ్గిర వుంచుకుని, పోషించి, ఏవో తప్పులెక్కలతో మోసం చేసి, వాడి ఆస్తిని పూర్తిగా కాజేశారు.

"వసుంధర"

వాళ్ళు, సులోచనుడితో, "నిన్ను మేం పోషించాలంటే, నువ్వు మాతో పొలానికి వచ్చి పని చేయాలి. లేకపోతే, మా ఇంట్లో, నీకు స్థానం లేదు," అని చెప్పారు.

సులోచనుడు మారుమాట్లాడకుండా, ఇల్లు వదిలిపెట్టాడు. వాడు ఒక అరణ్యం గుండా నడుస్తూ, బాగా అలిసిపోయి, ఒక చెట్టు కింద కూర్చున్నాడు. వాడికి చుట్టూ వున్న ప్రకృతి ఎంతో ఆనందం కలిగించింది. వాడు పరవశించిపోతూ, ఆశువుగా నాలుగు పద్యాలు చెప్పాడు.

ఆ చెట్టు మీద, ఎంతో కాలంగా ఒక బ్రహ్మరాక్షసుడుంటున్నాడు. వాడు కవిత్వమంటే చెవి కోసుకుంటాడు. సులోచనుడి కవిత్వం వింటూనే బ్రహ్మరాక్షసుడు, వాడి ముందు నిలబడి, తనను గురించి చెప్పుకుని, "కవిత్వం విని ఎంతకాలమో అయింది. రోజూ నాకు కవిత్వం వినిపించు. నీవు కోరినదిస్తాను," అన్నాడు.

సులోచనుడు అందుకు ఒప్పుకున్నాడు. బ్రహ్మరాక్షసుడు, వాడిముందు రుచికరమైన భోజనం వుంచాడు. సులోచనుడు భోజనం చేశాక, వాడికి చక్కటి పడక ఏర్పాటుచేసి, క్రూర జంతువుల బాధ లేకుండా, తనే కాపలా వున్నాడు. రోజూ సులోచనుడు, బ్రహ్మరాక్షసుడికి కవిత్వం వినిపించేవాడు. వాడికి తానుకీకారణ్యంలో వున్నానన్న బాధ కూడా వుండేది.కాదు.

ఇలా కొంతకాలం గడిచాక, ఒక రోజు బ్రహ్మరాక్షసుడు, "ఇంతకాలం నీకవిత్వం





బ్రహ్మరాక్షసుడు, వాడికి తిండి పెట్టడం మానేశాడు. సులోచనుడు నీరసంతో కృశించిపోయాడు తప్ప, వాడిపై కవిత్వం చెప్పలేదు. కొన్నాళ్ళు బ్రహ్మరాక్షసుడు, సులోచనుణ్ణి గాలిలోకి ఎగరవేసి, బంతిలా ఆడుకున్నాడు. అయినా వాడు చలించ లేదు. చివరకు బ్రహ్మరాక్షసుడు విసిగి పోయి, వాణ్ణి గిరగిరా తిప్పి, శక్తికొద్దీ దూరంగా విసిరివేశాడు.

మామూలుగా అయితే సులోచనుడు, ఎక్కడో నేల మీద పడి చావవలసిందే! అదృష్టం కొద్దీ వాడు సూటిగా వెళ్ళి, రాజాంతఃపురంలో, రాజు శయనించివున్న హంసతూలికాతల్పం మీద పడ్డాడు.

విన్నాను. నీకెన్నో సేవలు చేశాను. ప్రతి ఫలంగా, నా మీద కవిత్వం చెప్పు," అని అడిగాడు.

అందుకు సులోచనుడు, "నన్నడిగిం దని ప్రకృతిపై, నేను పద్యాలల్లానా? నాకు తోచిన విషయం పైనే నేను కవిత్వం చెప్పగలను," అని జవాబిచ్చాడు.

"నువ్వు నాపై కవిత్వం చెప్పి తీరాలి. అంతవరకూ నిన్ను, ఈ అరణ్యం నుంచి వెళ్ళనివ్వను. రోజూ నిన్ను హింసలపాల్జే స్తాను," అన్నాడు రాక్షసుడు కోపంగా.

"నీ కోపం, బెదిరింపులూ, నాలో కవిత్వాన్ని పుట్టించలేవు," అన్నాడు సులోచనుడు.

రాజు ఉలిక్కిపడి నిద్రలేచి, సులోచ నుణ్ణి చూసి, "ఎవరు నువ్వు? ఇక్కడి కెలా రాగలిగావు?" అని అడిగాడు.

సులోచనుడు, రాజుకు తన కథ చెప్పు కున్నాడు. విచిత్రంగా వున్నప్పటికీ, రాజు ఆ కథను నమ్మాడు. ఆయనకు కవిత్వ మంటే పెద్దగా ఆసక్తిలేదు. అయినా, సులోచనుడి కవిత్వం వినగానే, ఏదో తెలియని సంతోషం పుట్టి, "నువ్వు కొంత కాలంపాటు, నా కొలువులో వుండు," అన్నాడు.

సులోచనుడు, అందుకు, తన అంగీ కారం తెలిపాడు.

రాజుగారి కొలువులో, ప్రతి ఒక్కరూ సులోచనుణ్ణి మెచ్చుకోసాగారు. వాడు రాజభవనం సౌందర్యాన్నీ, రాజధాని అందాలనూ, అక్కడి నదులు, తోటలు— అన్నింటినీ వర్ణిస్తూ చెప్పిన కవిత్వం, నగరమంతటా పాటలుగా ప్రసిద్ధి చెందింది.

ఒకనాడు మహారాణి, రాజుతో, "ఏ అందమైనా, కవులవల్లనే ప్రసిద్ధి చెందుతుంది. నేను కథానాయికగా, మీరు కథానాయకుడుగా, సులోచనుణ్ణి, ఒక కావ్యం రాయమనండి," అని చెప్పింది.

రాజుకు యీ సూచన నచ్చింది. సులోచనుడు, తన కథను కావ్యంగా రాస్తే, అది కూడా ప్రజలందరూ పాటలుగా పాడుకుంటారని, ఆయనకు తోచింది.

రాజు, సులోచనుణ్ణి పిలిచి, మహారాణి కోర్కెను గురించి చెప్పాడు.

అందుకు సులోచనుడు, "ప్రభూ, ఏ అందమైనా ముందుగా, నా హృదయాన్ని ఆకర్షించాలి. అప్పుడు మాత్రమే, నేను ఎవరూ కోరకుండా నే కవిత్వం రాయగలను. నన్ను ఆకర్షించలేని అందంపై, అడిగినా నేను కవిత్వం చెప్పలేను," అన్నాడు.

రాజు, సులోచనుడికి వారం రోజులు గడువిచ్చాడు. సులోచనుడిలో మార్పు లేదు. ఆయన ఆగ్రహించి, వాడిని కారాగారంలో బంధించాడు.

ఒక సంవత్సరం గడిచాక రాజు, సులోచనుణ్ణి చూడబోయి, "ఎలా వుంది, నీకీ జీవితం?" అని ప్రశ్నించాడు.



"ప్రభూ, ఈ ఒంటరితనం, నా ఆలోచనలను భగవంతుడి పైకి మళ్ళించింది. ఆయనపై కవిత్వ మల్లుకుంటూ, ఎంతో తృప్తిగా బతుకుతున్నాను. ఇక్కడ, నాకెంతో బావున్నది," అని జవాబిచ్చాడు సులోచనుడు.

"కనిపించని భగవంతుణ్ణెందుకు ప్రార్థిస్తావు? కంటికి కనిపించే ప్రత్యక్ష దైవాన్ని, నేను. నువ్వు కోరినదివ్వగలను. నాపైనా, మహారాణి పైనా కవిత్వమెందుకు చెప్పవు?" అని అడిగాడు రాజు.

సులోచనుడు, ఒక పద్యాన్ని ఆశువుగా చెప్పాడు.

"అదృష్టదేవత, నన్ను బ్రహ్మరాక్షసుడి బారి నుంచి తప్పించిందనుకున్నాను. కాని, ఆ దేవత, నన్ను మరొక బ్రహ్మరాక్షసుడి వద్దకు చేర్చిందని, ఆలస్యంగా తెలుసుకున్నాను. బ్రహ్మరాక్షసులు, కవులను వేధించగలరు కాని; కవిత్వాన్ని పుట్టించలేరు!" అన్నది, ఆ పద్యంలోని భావం.

ఇది వినగానే, అరణ్యంలోని బ్రహ్మరాక్షసుడికీ, తనకూ ఏమీ భేదం లేదని రాజు కూ్కడా అర్థమైంది. ఆయన తన తప్పు తెలుసుకుని, సులోచనుణ్ణి కారాగారం నుంచి విడిపించి, "సులోచనా, ఈ రోజు నుంచీ, నువ్వు సర్వస్వతంత్రుడివి! నీకు తోచిన విషయంపై కవిత్వం చెబుతూ, నా కొలువులోనే వుండు," అన్నాడు.

రాజూ, రాణీ కూడా త్రికరణశుద్ధిగా, కవిత్వాన్నాదరించడం నేర్చుకున్నాక, సులోచనుడు, వారిరువురినీ ముఖ్యపాత్రలుగా చేసి, ఒక కావ్యం రాశాడు. ఆ కావ్యానికి రాజ్యంలో బహుళ ప్రచారం లభించింది.

ప్రతిభగల కవి చేత, అడగకుండా కావ్యం రాయించుకోగలిగిన రాజు, నిజమైన సరసుడని, సులోచనుడాకావ్యంలో పేర్కొన్నాడు. ఆ విధంగా, రాజుకు గొప్పకవి, పండితపోషకుడన్న కీర్తి లభించింది.






# ఎసరు మసళ్ళు

ఒక గ్రామంలో రంగయ్యా, రంగమ్మా అని ఇద్దరు దంపతులుండేవారు. రంగయ్య వట్టి సోమరి. ఏ పనీ చేతకాదు. ఇంత తిండి తిని ఊరంతా తిరిగి వచ్చేవాడు. గయ్యాళి భార్య రంగమ్మచేత తిట్లు తిని దులిపేసుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు ఇంట్లో గింజలు లేవు. రంగమ్మ వంట చెయ్యకుండా కూర్చుంది. రంగయ్య తిండి వేళకు ఇంటికి వచ్చి అన్నం పెట్టమన్నాడు. రంగమ్మ మొగుణ్ణి నానా మాటలూ అన్నది. "నీకు ఏ పనీ చేతకాదు. నేనీ సంసారం ఎంతకాలం ఈదగలను? ఇకనుంచీ నీవు ఏ విధంగా నైనా సరే గింజలు తేవాలి, నేను వండాలి. ఇంకో విధంగా తేలేకపోతే దొంగతనమైనా చేసి గింజలు తీసుకురా!" అన్నది.

రంగయ్య ఈ మాటలు విని కొయ్య బారిపోయి, "నన్ను దొంగతనం చెయ్య మంటావా? అదెంత తప్పు పని! పైగా, నాకు దొంగతనం చెయ్యటం చేతకాదు కూడా." అన్నాడు.

"అదంతా కుదరదు. నేను చెప్పినట్టు చేస్తే చెయ్యి. లేకపోతే ఇదుగో చీపురు కట్ట!" అని రంగమ్మ మూలనున్న చీపురు కట్ట తీసి మొగుణ్ణి బెదిరించింది.

రంగయ్య భయపడిపోయి, "ఎక్కడ దొంగతనం చెయ్యాలో, ఎలా చెయ్యాలో కూడా నువ్వే చెప్పు," అన్నాడు.

"జాము పొద్దెక్కనాక జనం పొలాల మీద ఉంటారు. అప్పుడు నీవు ఏదో ఇంట జొరబడి గింజలు ఎత్తుకురా," అన్నది రంగమ్మ. రంగయ్య అలాగే చేయ సాగాడు. అతను ఎంతకూ రాకపోతే రంగమ్మ వీధిలోకి వచ్చి, "ఎసరు మసళ్ళు!" అని కేకపెట్టేది. రంగయ్య గింజలు దొంగిలించి వచ్చేసేవాడు.

అతను ఒకరోజు దొంగతనం చేసిన ఇంట్లో మరొక రోజు చేసేవాడుకాడు. తనకారోజు అవసరం అయిన తిండి గింజలు తప్ప, ఆ ఇంట్లో కనిపించిన మరే విలువైన వస్తువైనాసరే అతను దొంగిలించేవాడుకాడు.

ఇలా కొన్ని రోజులు జరిగాక గ్రామంలో తిండిగింజల దొంగతనం జరుగుతున్నట్టు గ్రామస్థులు పసికట్టారు. ఎలాగైనా దొంగను పట్టటానికి వాళ్ళు నిశ్చయించుకుని, తగుసన్నాహంలో రహస్యంగా కాపువేసి వున్నారు.

ఒకనాడు దొంగతనానికి రంగయ్య గ్రామపెద్ద ఇంట జొరబడ్డాడు. తిండి గింజల దొంగకోసం కాపలా వేసిన గ్రామస్థులు వెంటనే అతన్ని పట్టుకుని, ఇంటిముందు గుంజకు కట్టేశారు.

తన భర్త ఎంతకూ గింజలు తీసుకుని రాకపోయేటప్పటికి రంగమ్మ వీధిలోకి వచ్చి, ''ఎసరుమసళ్ళు!'' అని పెద్దగా పొలికేక పెట్టింది.

ఆ కేక వింటూనే రంగయ్య గొంతెత్తి, ''గుంజకు బందిళ్ళు!'' అని మారు పొలికేక పెట్టాడు.

గ్రామపెద్ద ఇదేమీ అర్థంకాక, ''ఏమిట్రా ఇదీ?'' అని అడిగాడు.

రంగయ్య జరిగినదంతా గ్రామపెద్దకు చెప్పి బోరున ఏడ్చాడు. అక్కడ చేరిన గ్రామస్థులంతా పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.

గ్రామపెద్ద రంగమ్మను పిలిచి, ''నీ మొగుణ్ణి పనీ పాటా చేసుకునేందుకు పురికొల్పటానికి బదులుగా, దొంగతనానికి పురికొల్పుతావా?'' అని గట్టిగా చివాట్లు పెట్టి, రంగయ్యను కూడా కష్టపడి పని చేసుకోమని గట్టిగా హెచ్చరించి, వదిలి పెట్టాడు.

అది మొదలు రంగయ్య బుద్ధి తెచ్చుకుని, దొంగతనం చేయడం మాని, పది మందితోపాటు తాను కూడా ఒళ్ళువంచి కూలీ నాలీ చేసుకుంటూ గౌరవంగా బ్రతకటం నేర్చుకున్నాడు.





## నత్తనడక

సాధారణంగా మామూలు నత్త, అతివేగంగా నడిస్తే గంటకు 165 అడుగులు పయనిస్తుంది. మైళ్లలో చెప్పాలంటే గంటకు 0·0313 మైలు (50.3మీ॥) వేగంతో పయనిస్తుందన్న మాట!



## ఖడ్గమృగం కొమ్ము

జింక, దుప్పుల కొమ్ముల్లాగా ఖడ్గమృగం కొమ్ములు ఎముకలతోనో, ఎముకలవంటి పదార్థంతోనో చేయబడినవి కావు. వీటి కొమ్ములు ఒత్తబడిన వెంట్రుకలతో తయారైనవి!

## నాయకుణ్ణి అనుసరించు!



బాతుల జాతికి చెందిన పక్షులు 'V' ఆకారంలో పయనిస్తాయి. ముందుపోయే పక్షిని ఇతర పక్షులు అనుసరిస్తాయి. ముందుపోయే పక్షి కొంతసేపటికి దాని వెనక వున్న పక్షికి అవకాశమిస్తుంది. అందువల్ల పక్షులు గుంపునుంచి తప్పిపోకుండావుంటాయి.

## కాపీ పిట్ట

ఛాఫించ్ అనే సీమపిట్టకు స్వయంగా పాడడం చేతకాదు. ఇతర పక్షుల కూతలను అనుకరించి, ఈనువాయి వంటి ఈ పిట్ట పాడుతుంది.





## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Madan Gopal



P. S. Girota

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎందుకా దరహాసం?

రెండవ ఫోటో: చూడు నాదొరవేషం!

పంపినవారు: ఓలేటి శ్రీనివాసరావు, విజయనగరం—531201, (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# జలుబు మిమ్మల్ని విడవకుండా పీడిస్తోందా?

మామూలు మందులు జలుబుని
కేవలం కొద్ది గంటల పాటు
నిద్రపుచ్చగలవు అంతే.

ఆయుర్వేదంలో జలుబుని
పూర్తిగా పోగొట్టే ఓ ఆయుధం ఉంది.

మామూలు మందులు జలుబుతో పోరాడవు. దానివల్ల వచ్చే ఇబ్బందుల్ని కాస్సేపు మాత్రం అణచి ఉంచుతాయి.

ఆయుర్వేద త్రిశూన్ మీ శరీరంలో నిరోధక శక్తిని పెంపొందిస్తుంది. ఆ విధంగా జలుబుని ఎదుర్కొనేలా చేస్తుంది.

మీరు త్రిశూన్‌ని మొదటి జలుబు లక్షణం కనపడగానే వాడారంటే జలుబుని సమర్థంగా నిరోధించవచ్చు.

మోతాదు: ఒక్కొక్క మాత్ర చొప్పున రోజుకి రెండుసార్లు.

జలుబు అప్పుడే ప్రారంభమవుతూంటే, త్రిశూన్ ఒక్కరోజు తీసుకోండి. జలుబు తీవ్రంగా ఉంటే త్రిశూన్ 2 1/2 రోజులు తీసుకోండి. టీ, కాఫీ లేదా వెచ్చటి నీటితో తీసుకోవాలి. ప్యాకెట్ మీది పూర్తి వివరాలను జాగ్రత్తగా చదవండి.

**Trishun** **త్రిశూన్**

జలుబుకు తిరుగులేని జవాబు








జండూ ఫార్మసూటికల్ వర్క్స్ లిమిటెడ్.
గోఖలే రోడ్ సౌత్, దాదర్, బొంబాయి 400 025.

Trikaya.ZP.2.86 TEL A

# రామ్, శ్యామ్
## అడవి మనుషులతో అనుభవం

PARLE
















POPPINS










పార్లే
పాపిన్స్
నోరూరించే. మనసుదోచే. మైమరపించే.

everest/86/PP/411-tl